శ్రీహయగ్రీవాయనమః



శ్రీమదాంధ్ర భాగవత దశమస్కంధమునందలి

యర్థమందరికిసులభముగ దెలియునటుల





# యక్షగానముగా.



పాకనాటి - గణపతిరెడ్డిగారిచే రచియింపఁబడిన -

# గోపాలవిలాసము.

ఇది

సంస్కృతాంధ్ర ద్రావిడోపాధ్యాయులైన -



శ్రీనివాసాచార్యుల చేత-

లేఖకప్రమాదాదిజనితదోషంబులఁ బరిష్కరింపఁబడి



మ-హా-రా- శ్రీ|| కేశవముదల్యారిగారి.

ప్రభాకరముద్రాక్షరశాలయందచ్చు వేయించి-

ప్రకటింపఁబడియె.

౧౮౭౦సం|| జూన్ - నెల.



கோபாலவிலாசம்.



శ్రీ ర స్తు,

గో పా ల వి లా స ము.— య క్ష గా న ము.



శ్రీరామానిను నెంతునాదిమదిలోసీతామనోనాయకా। ఘో
రాకారమదారిదయిత్యహరణాకోట్యర్క-తేజోమయా। నీరేజాస
నసేవితాంఘ్రీకమలానీవాడనన్నేలుమీ। కారుణ్యాకరరాఘవా
నృపమణీకాకుస్థవంశాగ్రణీ॥ ... ... ...*



వ॥ ఇట్లునృపతియయినరామస్వామినివినుతించిహరిహరబ్రహ్మా
దులనేమనివినుతింపుచున్నాడు-

త్రి పు ట.

సిరికిజెప్పకనురికిమకరినినరికివేగమెదరికినీడ్చాయు- గరికినభయంబొ
సగుశ్రీనరహరికిశరణు॥ ౧॥మంటిరథమటగుంటివిల్లటజంటనాలుకదండనార
ట-కంటిమంటలమరునిగెలిచిన-ఘనునిగొలుతున్॥ ౨॥ తమ్మిబుట్టినధాతతా
నయికమ్మి లోకములెల్ల నేలిన-బమ్మదేవరపదములెన్నెద-సమ్మతిగను॥...*
వ॥ అనియిట్లువిష్ణుశివ బ్రహ్మలకునమస్కరించి వారిదేవులయినల
క్ష్మీపార్వతి సరస్వతీదేవులనేమని సన్నుతింపుచున్నాడు-

త్రి పు ట.

దిగువనుండకమగనియెదపయిబిగువుచూపుచు దెగువతోడను - నగ
వులాడెడికలికిముద్దుల- మగువనెంతున్॥ ౧ ॥ పుట్టుగిట్టువులేనిదేవునిచెట్ట
బట్టినిగట్టునట్టిని- గట్టిగానామదినిదలచెద- దిట్టముగను॥ ౨॥ వీణెమీటుచు
విభునిచెంతనుజాణ తనములునెరపుచకర్ణని - వాణిపద్మజురాణినలికుల -
వేణిదలతున్ ॥ ... ... ... ... ౩॥
వ॥ ఇటువలెవర్ణించి త్రిమూర్తిస్వరూపంబయిన సూర్యదేవునే
మనిగొనియాడుచున్నాడు-

అటతాళం-

ఉదయకాలమునందుబాపనియునికివోలె - నిగముని- బొరలుచునుబెం
పొందుదేవుని- బొగడికొలుతురా ॥ అలయకనుమధ్యాహ్నవేళనునబ్బురము
గాజంగమువలెనెవిశ్వములెల్లనేలెడివానినెంతురా॥ సరగుదాసరివేషముల
వడిపాయములనూ- లోకమునుమరుగుమాయలదిరుగువేల్పునుసరగదలతురా॥

వ॥ ఇట్లులోకారాధ్యులవినుతించి సకలవిద్యలకుగర్తయయిన గణే
శుని నేమనిస్తుతియింపుచున్నాడు-

జంపె-

ముక్కంటిఫలములేమెక్కవదేవరయనుచు - ముక్కంటిబిడ్డనికిమ్రొ
క్కెదనువేడ్కా॥ ౧॥ కన్నంపులాయమునను న్న తేజినినెక్కి- యన్నివిద్య
లనొసగుచున్నతనిగొలుతురా॥ ౨॥ వ్యాసవాల్మీకులకుదాసుడయిసేవించి-
వాసవాదులకెల్లవందనమొనర్తురా॥ ౩॥ ఆకాళిదాసాదియఖిలసత్కవుల
కును- ప్రాకటంబుగనెపుడుప్రణతులొనరింతురా॥ ౪॥ ... *

వ॥ ఇటువలెసకలదేవతాప్రార్థనంబునుసుకవులకు వందనంబును
నాచరించి శ్రీమహాభాగవతంబున దశమస్కంధంబునం కృష్ణలీలలువర్ణన
సేయదలంచియున్న నొక్కనాడు-

సీ॥ నిఖిలగోచరుడయిననీలాద్రితనయుండువిప్రవేషముదాల్చి వేడ్క
తోడ। నొకచేతబెత్తంబును త్తరీయంబును ముసిముసినగవుతో మోదమున
ను। మధ్యాహ్నవేళ నామందిరంబున కేగుదెంచియునుదకంబుదెచ్చుటనియు।
మాధవుచెరితలుమరచినాడవునీవు రచియింపుమిక చాలరమ్యముగను - విను
మువూపల్కులన్నియువీనులలర। గనుము మోక్షంబుస్త్రీహరికథలవలన।మ
నుమసుజ్ఞానవయిభక్తిమమ్ముగలది। మనసురంజిల్లనిట్లనెమాధవుండు॥ *

క॥ నడవడగలిగినయపుడే। బడయంగానగునువిష్ణుపదవినిగానరా।
విడువకకృష్ణునిచెరితలు। కడువేడుకవెన్నముద్దగణపనిపెద్దా ... *

వ॥ అనుచునానతిచ్చి యదృశ్యుండయిన పరమేశ్వరుండని నిశ్చయిం
చి శుచియయిహార్చుండి భాగవతార్థంబునెత్తియేతచియింపంబూనినగో
పాలవిలాసంబను యక్షగానంబునకు గధాక్రమంబెటువలె॥

సీ॥ అభిమన్యుపుత్రుండుహర్షంబుతోడను శుకయోగిరాయనిజూచిపలి
కె। దాపసోత్తమమిరుదయిత్యారికథలెల్లవినుపింపజెవులకువిందులయ్యె।నం

మనికుట్టులై నాడేలమందలోబలరాముడును తానుబరిఢవిల్లె। దెలియ జెప్పుము కృష్ణదేవుని మహిమా జన్మసాఫల్యమౌజడులకైన । నతనిచర్యలు వినియెద నానతిమ్ము। యితరములువిన నేనొల్లనిందిరేశు।పదములె న్నెదనాచిత్తపంకజ మున। సరసగుణధామబుఋషికులసార్వభౌమ॥ ... ... *

వ॥ అనియడిగినబరిక్షిత్తునకుశుక యోగీంద్రుం డేమనుచున్నాడు.

క॥ శ్రీతరుణీప్రియుచరితలు। చేతోమోదంబుతోడసిరులునొసంగు।న్నాతకములడచిపుచ్చును। భూతలమునవినగఘోరుపుణ్యాత్ములకున్॥ ... *

వ॥ మరియేమనుచున్నాడు,

గీ॥ శివునిపూజజేసి చిత్తంబురంజిల్ల । విష్ణుకథలుచమువవినగలేని। ఖలుల నెంచచ్చుగరులతోసమమని। మానవేశయోగమతమునుమ్ము. ... *

వ॥ కావునసకలకల్మషహరంబును మోక్షసాధనంబునునగుశ్రీమహాభాగవతంబుదెలియవివరించెదనాకర్ణింపుమనిశుకయోగీంద్రుండేమనుచున్నాడు

ద్విపద.

వినవయ్యజెప్పెదవిష్ణుకీర్తనము - సనకాదిమునియోగసారమంత్రంబు - కలుషాంధములనెల్లగాల్చుకార్చిచ్చు - తెలియుముభవరోగదివ్యౌషధంబు- వేడుకనీకథవినుముదెల్పెదను - రూఢిగాబలురోగరోగముల్వీడు- వినుపింతుహరికథావృత్తాంత మెల్ల- బనిబూనియామహాభాగవతంబు-అవియెటులన్ననునవనిలోనచట - మదమునవిహరించుమనుజదానవులు - దుష్టులై చెలరేగిదుర్వృత్తితోడగష్టపుజనులనుగాసిపెట్టుచును- న్యాయంబుదప్పియన్యాయంబుదలచి- పాయకవిహరించుపాపకర్ములను- భారమానగలేకపడతి భూదేవి- గోరూపమై బ్రహ్మకొలువుకుబోయి-కన్నీరువరదలుగాగారుచున్న సన్నుతాంగినిజూచిసరసిజోద్భవుడు - ఇదియేమియోయింతియీరీతివగువగదిసెనేమునుపటికనకాక్షుడిపుడు - వాడనీళ్లడె శ్వేతవరాహముచేత- పోడిమిచెడనేల పూబోడియనిన - నవనియిట్లనిపల్కె- నవధారుదేవ - భవములుసేయుచు బలసియుభూమి - వరులుగ్రుమ్మరెదరువాక్రువ్వనేమి - పరికింపమిక్కిలి భారంబుగాగ - మోవజాలక నేను మొరబెట్టుకొనుచు - నీవుదిక్కని నేను నిజముగావచ్చి- తనవినిభూసతి యడలువారించి - తనమది లోవిధితలపోసిచూచి - ధరణిభారముమాన్పదగునట్టివాడు - హరియనిచిం

తెంచి యమరులుగొల్వ - యంచవాహనమెక్కి యప్పుడే వెడలి - మంచిల
గ్నంబునమాధవుగాంచి - మణిమయవస్తువుల్ మరికానుకిచ్చి - ప్రణమి
ల్లి భక్తితోఁ బ్రస్తుతిజేసి యోదేవదేవేశ యోదైత్యనాశ - భూదేవికడుబా
ధఁ బొందియువచ్చి - పాపకర్ములమోవఁబాడిగాదనుచు - నీపాదపద్మముల్
శరణమ్మి చాల - భూభారముడిపెడిపురుషులెవ్వారు - ఈబాధమాన్పుట కీ
వేకాదలప - ననివిన్నవించినయంబుజాక్షుండు - మనముననుప్పొంగి మహి
నిమూరార్చి - సన్మతితోడను సర్వేశ్వరుండు - తమ్మిచూలినిజూచి తగని
ష్టులనియె - వసుధభారముదీర్పవడిగ నేబోయి - వసుదేవుమదిలోని వాంఛ
లుదీర - జనియించిమస్తులచంపుదునికను - ననియానతిచ్చిన యంబుజాస
నుడు - కమలాక్షునకు మ్రొక్కి కడువేడ్కతోడ - నమరులతోఁగూడి య
రిగెనాత్తణమె. ... ... ... ... *

వ॥ అంతభూలోకంబున కంసుండనువాడు తనచెలియలైనదేవకీదేవిని
వసుదేవునకిచ్చి వివాహంబుసేయించి యుల్లంబురంజిల్ల వారలకు గజతుర
గస్యందనాందోళిక భూషణాంబరములను దాసదాసీజనంబులనరణంబిచ్చి
చెలియలినిపునవ్వాడువారలరథంబుపైనిడుకొని తానుసారథియైరథంబుగ
డుపుచుముందరభేరీమృదంగాదివాద్యంబులు చెలంగమార్గంబునంబోవుచు
న్నసమయంబుననాకసంబుననశరీరికంసునకిట్లనియె. ... *

క॥ తుష్టయగుభగినిమెచ్చగ । నిష్టుడవై రథముగడుపు టెరుగవుమీదన్।
శిష్టయగునీతలోదరి। యష్టమగర్భంబునిన్నుహరియించుసుమీ॥ ...... *

వ॥ అనినయశరీరిపల్కుల కులికిపడికంసుండు రథంబుపైనుండిదిగ్గున
దుమికి చెలియలికొప్పుపట్టి ఖడ్గంబుపెరికి దెగవ్రేయంబూను సమయంబున
వసుదేవుండడ్డంబువచ్చి శాంతవచనంబుల కంసునితోనేమనుచున్నాడు.

ఉ॥ అన్నవునీవుచెల్లెలికినక్కట చీరలుమాడలిచ్చుటో । మన్ననసేయు
టోమధురమంజులభాషలనాదరించుటో । మిన్నులమోసెయేనిజము మేలని
చంపకుమన్నమానిరా। వన్నసహింపుమన్నతగదన్నవధింపకుమన్న వేడదన్॥

వ॥ అనియిట్లువసుదేవుండు వేడుకొన్న సహించిచెలియలిముందలవిడిచి
మరలిమధురాపురంబునకుందోట్కొనివచ్చి వారలంబద్ధులంగావించికొన్ని
దినంబులకుగ్రమక్రమంబున దేవకీవసుదేవులకు బుట్టినబిడ్డల వధియింపుచు
న్నంతజనార్దనుండు శేషునిరావించినీవు దేవకీగర్భంబుననుండుమని వనిచి

ననతండలుల గావింపనంత యోగమాయనుబు త్తెంచి దేవకీ గర్భంబుననున్న పిండంబునునందుని భార్యయయినరోహిణీ దేవిగర్భంబునందునిచిరమ్మనిననది యటువలె నేయునిచినరోహిణి దేవి గర్భంబుదాల్చి సంపూర్ణ శరీరునిగాబల భద్రు నింగనియె నదిచూచినందుండు పొంగుచుండెనంత కొన్నిదినంబులకువి ష్ణు దేవుండుతానును దేవికీదేవి యుదరంబుంబ్రవేసించినంత గంసుండష్టమ గర్భంబుదాల్చినతనచెలియలింగనిభీతిల్లకయుండెనయ్యవసరంబున దేవికీదే విగర్భచిన్నెలెటువలెనుండెను॥

## అర్థచంద్రికలు.

భామచెక్కులదీవి-పలుచనయియుండెన్॥బలుసన్నమానడుము-బళు వుగనిపించెన్ - పసిమిచాయలమేన-బాండిమముదోచెన్ - నాతికుచముల మొనలు- నల్లనయియుండెన్-మన్నురుచియయితోచె-మగువకుననపుడున్- కుడుపుకొంచంబాయె- కోమలికిదినమున్- వస్తుఛాయలమీద - వాంచలు పొంగెన్- అతివచెరియించుటల - నలమటలుబుట్టెన్- చెలులరమ్మనిపిలిచి చేలాగులందున్॥ ... ... ... ... ... ... ...*

వ॥ ఈరీతినున్న చెలియలింజూచికంసుండుభ్రమసెనట యెటువలెను॥

గీ॥బయలుమాటకుజింతించిభయముతోడ। దిగులుమదిజొచ్చియేమి యుదెలియలేక। తనదుచెలియలియష్టమతనయుచేత।జావునిజయమనికంసుం డుచాలవగచె॥ ... . ... ... ... ... *

వ॥అంతకంసుండెటువలెనుండెను॥

జంపె,

దేవకీగర్భమున దేజరిల్లెడుశౌరి - భావమంతయుదెలిసి పదిరికం సుండు ॥ కావరంబుననసురకాంతలనుబిలిపించి - కావిలుండగబనిచెగడుభీ తితోడ ॥ తావుతావులనెల్లదగువారినియమించి- దేవకినినేమరకతెగువతో నుండెన్ ॥ ఏవేళనాసలినినేమరకచూచుచును - నీవిధంబునరాత్రిలిటుగా చియున్నన్॥ ... ... ... ... ...*

వ ॥ అంతనొక్కనాడుకావిలియున్నవారునుమంత్రసానులునునలసి నిద్రించుచున్నసమయంబుననిశీధవేళనష్టమిరోహిణీయందుదేవకీగర్భంబు వెలువడిహరితననిజరూపంబుచూపెనటయెటువలెను,

సీ ॥ నీలమేఘచ్ఛాయ నెరసిన దేహంబు పసిడిఛాయలమించు పచ్చడంబు। తమ్మిరేకుల సోగ తగినకన్నులబెళుకు మకరకుండలకాంతిమలయు తళుకు। శంఖచక్రగదాదిశార్ఙ్గసాధన పెంపు కరములు నాల్గును గలుగు సొంపు। కంఠదేశంబున గౌస్తుభమణి దండదీప్తులగుంపులు దిశలు నిండ। ఇక్కదనమున భాసిల్లు సంతసిల్లు। మొలకనవ్వును మోమున ముద్దుగుల్క। దల్లి వినబల్కె మిక్కిలి దయదలిర్ప। సారసాక్షుండు భక్తమందారుడపుడు॥ ... ... *

త్రిపుట.

అమ్మ వినవే కంసుకొరకయి యవతరించిన కృష్ణదేవుడ - నమ్మియుండుము నామపలుకులు నలిననేత్రి- చిమ్మిరేగిన దనుజవరులను గమ్మి రణమున నెమ్మెలడతును। మిమ్ము బాధలబెట్టువాలికి మిత్తి నను మీ॥ తెమ్ము వేగమె నీదు పురుషుని తెమ్ము నమ్మిచటికి నిబొడగన। వొమ్మిగూడిన సతులు దెలియక రమ్ము నీవు॥ ... *

వ॥ అనిన విని మాయా వాదిశిశువుతో మగువ యేమనుచున్నది.

జంపె-అన్న వినుమీ కంసు డెన్ని బాధలబెట్టె। నన్నిటి నోర్చితిమియన్న మేమిపుడు। నిన్ను గన్నప్పుడే వన్నె గాంచితి నికను। నెన్ని కర్మములున్న నన్నంట వెరచు। కొన్ని దినములు గాసి కోర్చియున్నందులకు। గన్నులకు జల్లగా గాంచితి ని నిన్ను॥ ... ... ... ... ... ... ... *

గీ॥ పాపమెల్ల వీడు పరమాత్మ నిను జూడ। గన్న తండ్రి బంధకములు వీడు। కరుణయుంచుమనుచు గమలాక్షు వేడిన। వేగ బంధకములు వీడు వచ్చె॥ ... *

వ ॥ అంతవసుదేవునకు సంకెళులు వీడిన కామాది షడ్గుణంబుల డంచిన యోగిచంద్రుని చందంబున వేగవచ్చి పరంజ్యోతిమయుండైన బాలుని జూచె నటయెటువలెను॥

సీ॥ జలరథదేహు నాజానుచతుర్బాహు సరసీరుహాక్షు విశాలవక్షు। చారుదాశంఖచక్రపద్మవిలాసు గంఠకౌస్తుభమణికాంతిభాసు। గమనీయకటిసూత్రకంకణ కేయూరు శ్రీవత్సలాంఛనాంచిత విహారు। నురుకుండలప్రభాయుతకుంతలలలాటు వైడూర్యమణిగణవరకిరీటు। బాలుబూర్ణేందురుచిజాలు భక్తలోక। పాలు సుగుణాలవాలు గృపావిశాలు। జూచి తిలకించి పులకించి చిచోద్యమంది। యుబ్బిచెలరేగి వసుదేవుడుత్సహించె॥ ... ... ... *

వ॥ ఇట్లున్న బాలునింజూచి వసుదేవుండు తనమనంబున హరియని తలంచి సాష్టాంగదండప్రణామంబాచరించి ముకుళితహస్తుడై యేమనుచున్నాడు.

జంపె,

శరణు శంకరమిత్ర శరణురవిశశినేత్ర - శరణు వారిదిగాత్ర శరణుము
నిస్తోత్ర॥ శరణుదశవిధవేషశరణుదానవదూష - శరణుకౌస్తుభభూషశరణు
గజపోషా॥శరణులక్ష్మీవత్సశరణుమనర్ఘశిక్ష- శరణుసజ్జనపక్షశరణార్థిరక్షా॥

వ - అనియిట్లువినుతించినమున్దులుగుల్లుకుపాపండేమనుచున్నాడు,

ద్విపద-వసుదేవచెప్పెదవరుసతోవినుము - మసకలశిశువునయిమహీమీ
దబుట్టి- శరసునిమదమెల్లఖండించివైచి - హింసలన్నియుదీర్తునికవెరపేల-
పూనితినీమాయభూసురవినుత - నేనువిష్ణుడసుమ్మునీమదిలోన-శిశువనియెం
చకుశీఘ్రమేనీవు-నిశివేళయాదవునిలయంబుజేరి- భామనందునిభార్యప్రక్క-
లోడించి-కోమలిగన్నట్టికూతునుదెచ్చి - దేవకింకదిచ్చితెగువతోడుతను-నీ
వుయెప్పటియట్లనేర్పుతోనుండు - మనియానతిచ్చినయాశ్చర్యమంది-విను
తుడయిక్రృష్ణునివేగంబెకొనుచు-నొరులెరుంగకయుండనొకజాములోన-నరు
దుగాయమునయునతివేగదాటి - రేపల్లెపురినడురేయనిజొచ్చి-సాపనివాస
తిప్రక్క-లోడించి- యాయాడశిశువునునతివేగమునను - మాయిగాగొనివ
చ్చి మగువకందిచ్చి-యిన్నిచిత్రంబులనింతితోజెప్పి - యన్నితానునుమరిచి
న్నట్లుండెనతడు॥ ... ... .. ... ... *

వ॥అప్పుడా యాడుపాప కావు కావున నేడ్చిననిద్రపోయినమంత్ర
సానులులికిపడిలేచికంసునిచేరంబోయినీచెలియలికి బిడ్డపుట్టెనని చెప్పినపిని
రుతండదరిపడిలేచివచ్చువిధంబెటువలెను॥

జంపె,

తలవెంట్రుకలువీడమొలచీరదిగజార - నలుదిక్కులునుజూచియల
యుగతివచ్చెక్ ॥ అలభీతిదగదొట్టిబలుకత్తిజేబట్టి - తెలివెల్లయటుబెట్టితెం
)తోకదిసెక్ - మమతలటువలెహెచ్చిమంత్రసానులమెచ్చి - తమకమున
ఎరిటిల్లుదాజొచ్చెనపుడు॥ ... ... ... ... *

వ॥ అచ్చటికిదేవకీదేవియడ్డంబువచ్చియన్నతోనేమనుచున్నది.

అటతాళము.

అన్ననీకునువైరిగాదిదియాడపాపా- తెలియగనెన్ననీకునుగోడలిం
మిభయము - చెల్లెలికినీశిశువునీయవేచెల్లుగానూ- మొక్కెద-జల్లిగా
శ్రీకాల్లుచుండుముచంపబోకు- శిశువుదీనినినీవుహత్యయుజేయనేల-కడగెడు

పశువు మొదలగు వానిజంపుట పాతకంబు- నీకు హత్యయు జేయ నేటికి నిలుపుమ
న్నా చెప్పెద - భీకరంబునను నుండు నీవిక భీతిమాని - ఆడవారలజంప నీకిది పా
డియగునా - యుడుగుము - వేడెదను నిన్ననుచు దేవకి వేగ మ్రొక్కెన్

వ॥ మఱియు కంసుడు మదాంధుడై చెలియలి నినదల్చి నభయపడియా
యమ్మ బిడ్డను నక్కున చేర్చి గడగడ వడంకుచున్న నెనరు లేక యప్పాపకర్ముండం
డాశిశువు పాదంబులొడిసి దిగిచి బిరబిరం ద్రిప్పి నేలపైవై చినపాప దిగువ
బడక యాకాశంబున కెగసి శక్తి స్వరూపంబై తనయెనిమిది హస్తంబుల చక్ర
గదాచాపఖడ్గాది సాధనంబులు ధరించి కిన్నరగంధర్వ సిద్ధసాధ్యులు గొల్వ కం
సునింజూచి పకపక నవ్వి యప్పుడే మనుచున్నది॥

గీ॥ పాపకర్ముడ నిను జంప బాలుడొకడు। పొదలుచున్నాడు రేపల్లెపురంబునం
దు। నతడు పగవాడు నీకును నరసి చూడ। నిజము నిజము నియామాయ సెలతజనియె॥

వ॥ అప్పుడు మాయాశక్తి పలుకులు విని కంసుండు వెరగుపడి వసుదేవ దేవ
కీ దేవుల వలన దోషంబులుడిగి వారల సంకిళులు విడిపించి వినయంబున బూజించి
వారల కుపచరింపదగు వారిని నియమించి తాను తన మంత్రులును కృష్ణుని చె
చ్చుటకుం దగిన యాలోచనలు సేయుచుండిరంత తెల్లవారిన రేపల్లెలో నందుని
కి గొడుకు బుట్టె ననిన విని గొల్లలు సంభ్రమించుచుండ గోపాంగనలగుంపులు
గూడి వచ్చుచు దమలో దామేమనుకొనుచున్నారు॥

గీ॥ ఏమి నోము ఫలముయింత ప్రొద్దున వార్త। వింటిమబలలార వీనులల
ర। మనయశోద చిన్నముగువను గనెనట। చూచి వత్తమమ్మ సుదతులార॥ ... *

వ॥ ఇటువలె నవ్వుచు వచ్చి బాలుని జూచి సంతసిల్లుచున్నంత ప్రౌఢాం
గనలు శిశువునకు జలకంబార్చిరటయెటువలెను॥

ఏకతాళము.

నీటిలో బొదలెడు మేటికి దొలకరి- నీటును జలకము బోటిఘటించెన్- ముగ్గు
రు మూర్తుల మూలంబితడని జగ్గుగనుగ్గిడె జక్కెర బొమ్మా ॥ హాతులఫణిపై
మెత్తగ బొరలెడు- చిత్తజజనకుని నెత్తులనిడిరి ॥ సృష్టికర్తయై చెలగెడు
వానికి - దృష్టిదీసిరా తెరవలు వేడ్కన్ ॥ కావుకావుమను కలకల ధ్వనివిని
కావుకావుమని క్రతుభుజులనిరి ॥ దివిజులు తానును దేవాధీశుడు - అవిరళ
భక్తిని నపుడే పొగడెన్॥ ... ... ... ... ... ... *

వ॥ ఆసమయంబున గోపకాంతులు పాలు నేతులవ సంతంబులాడి
రటయెటువలెను-

త్రిభంగులు.

పసుపునందరు మేనబూసి-మంచిపానేతులుచల్లబోసి॥ బిసరుహాక్షు లుగుములుగూడి - దొడ్డ - బిడ్డనుచువసంతమాడి - గోపకాంతలువగలుచేర్చి శౌరి - రూపు రేఖలుమదిని జేర్చి॥మాపు రేపును ముద్దుబాలా - మన-చూపుల కువింతాయెజాలా॥ ... ... ... ... ... ... *

వ॥ఇటువలెవసంతంబులాడిఅల్లో నేరేడల్లోయని పాడిరటయెటువలెను.

అల్లో నేరేడల్లో॥చెలగికృష్ణుండనుచు చెప్పరేమీరు ॥ అల్లో ॥ కరివేల్పువనవోరకుకలిగె నేనేడు|సిరివరునివలెనితడుచెలగుచున్నాడు॥ అల్లో॥ తరుణియశోదసుతనయుడై నాడు।గురికానివలెనితడుగురియుచున్నాడు॥అల్లో మింటపువ్వులవానమేనగురిసేనె । కంటిరేఖామలు వేడ్క- మెరసేనె॥అల్లో॥ జంటబాయక శివుడుసరగకదిసేనె । కంటిరేయీబాలకళలు మెరసేనె॥అల్లో ॥ అరుమగానప్సరసలాడియేగెదరు । సవగుననుజూడరే సతులారమీరు॥ అల్లో ॥ రంగలరజేజేలుపొంగుచున్నారు । పొంగళ్లుబెట్టేముపురుడెప్డుదీరు॥అల్లో నేరేడల్లో॥ ... ... ... ... ... ... *

మరిన్ని వెన్నెలలుబాడి రటయెటువలెను.

నూకాలమ్మాసుగొలువగా నేవెన్నెలాలాలో । వీరు । నూకానికిబెంట్లియయ్యె వెన్నెలాలాలో-సత్తిదేవిని వేడుకోగ - వెన్నెలాలాలో-అట్టె-బత్తిగాడుబ్రతికినాడు వెన్నెలాలాలో - పోతెరాజునుగొలువగా నే - వెన్నెలాలాలో- మనపోతినూతురు వేకటూయె - వెన్నెలాలాలో - ఎట్టిసానికిగొలువు సేయ-వెన్నెలాలో - పెద్ద-నట్టావు పేయలీనె-వెన్నెలాలో- అక్క-అమ్మసాకబోయె-వెన్నెలాలో - నిపుడు-లెక్క- లేనికడుపులాయె - వెన్నెలాలో- కుందలమ్మపున్యమున - వెన్నెలాలాలో- మననందునికికొడుకుబుట్టె - వెన్నెలాలాలో-పొంగళ్ళబెట్టేదమురారె - వెన్నెలాలాలో-మంచి-బోనాపుముద్దలాడుదము - వెన్నెలాలో - జాతరాలు సేయవలెనే వెన్నెలాలో - నీ - జాతునినడవడికె-వెన్నెలాలో॥ ... ... ... ... ... ... ... *

వ॥ ఈరీతిగోపసుగువలుప్పొంగుచుపురుడు తొమ్మిదిదినంబులుదీర్న తదనంతరంబయాబాలునితొట్లలోనునిచిజోలపాటలుబాడిరటయెటువలెను॥

క॥ జోజోగమలదళేక్షణ। జోజోమృగరాజమధ్యజోజోకృష్ణా । జోజో పల్లవకరపద।జోజోపూర్ణేందువదనజోజోయనుచున్ ... ... *

వ॥ మఱిన్నిజోలపాటలుపాడిరటయెటువలెను.

జోలలు.

జోలబాడెదమిపుడు సుందరాంగులము - జోలలకునిమురబోసొంపు చూచెదము॥ జో॥ శ్రీమహాలక్ష్మితోజెలగితిరిగెదవు- మామందలోనాడుసురిగితిరిగెదవు - వేమారుకేరుచును వేడ్కలందెదవు- ప్రేమతోగొల్లలకుబెంపుజూపెదవు॥ జో॥ రేపుమాపుననీవు లేపల్లెయందు-గోపసతులకుముద్దు-గులికేటిపొందు-జూపుచునుసతతంబు సుఖములేవిందు - నేపుననుపల్లవుల నేలిగివియిందు॥ జో॥ చక్కదనముననీకుసరియెవరులేరు - మక్కువతోజెలులెల్లనురిగితిరిగెదరు-చక్కగాదేవతలుసంపడించెదరు- మ్రొక్కిపొగడుచువారలుముదముజెందెదరు॥ జోజో॥ ... ... ... ... ... *

వ॥ ఇటువలె వేడుకపడుచున్న గొల్లపల్లవాధరుల యుల్లంబురంజిల్లనందు డత్యుత్సాహంబున జెలంగుచుభూసురోత్తముల రావించినామకరణంబుజేయించి విప్రులకులక్షుపాడి మొదవులదానమిచ్చి కనకనకభూషణాంబరముల దృప్తులంజేసిపనిచి పరమహర్షంబున సుఖంబుండెనని చెప్పినప్పని పరిక్షు న్నరేంద్రుండు శుకయోగీంద్రునితో నవ్వలికథావృత్తాంతం బేమని యడిగిన నతండేమని చెప్పుచున్నాడు॥

ద్విపద.

నందునికులసతి నారియశోద - కందర్పజనకునికంటినటంచు - నొకవేళసుప్పొంగుచుల్లంబులోన సకలంబుదామరచుజన్నిచ్చునపుడు - మనుజలీలలుదాచిమరచియాయింతి- యనుదినంబటువలెననుమానపడుచు- శిశువుసుదిలపోసిచిన్నినాయన్న-మిసిమిగాతొట్లలో మెల్లనిద్రించు- మనుచుముద్దాడుచునప్పమోదముననను- నెనరనుయ్యాలనుంచియోయయ్యనీవు- జోలబాడెదగృష్ణజోకొట్టెదమనుచు- జోలలుబాడినసొంపుతోనతడు - సదయుడైనిద్రించుచుసరగమేల్కాంచు - సుదతులుబిలచినజూచునవ్వుచును - నీరీతిబహువిమాయలింపులుమీరగేరుచుసతతంబు కేశవు॥ డుండ - కంసునిపంపునగతినరాకాసి - సంశయింపగరానిచక్కనిరూపు - వనితయైచెలగుచువసుదేవసుతుని పసిబూనితెగటార్చపరచివచ్చెదను - ననుచుపంతములాడియతివేగమునను - మనుజవేషముబూనిమగువచందమున-బాలింతరాలని ప్రజలెల్లజూడ పాలిండ్లగరళంబుపైటతోనడిచి - మనసిజుట్టంపు మదదంతియనగ-దసులత

వాడంగదలి రాకుబో - వసయుల్లిమిరియంపు వాసనలమర-బసపుసోకుల వె ల్లిపతముధరించి- పసినిచాయగ మేనప్రభలుప్పతిల్ల- బసిబిడ్డతల్లి గాభామాల లామితలకువాసనకట్టితగసంఘటించి- మొలకనవ్వుల మోముముద్దులుగులుక-పాపపునాదయిత్యాభామ మెల్లగను-రేపల్లెపురిజొచ్చి రేవంతరాలు॥ ...*

వ॥ ఇటువలెవచ్చినభూతకిచల్లలమ్మువిధంబెటువలెను.

క॥ రక్కసిరూపముడాచియు। ఒక్కనియామొద్దుగమ్మచల్లోయను చుక్రెక్కనవీధినిరాగా। నక్కరగాగొల్లపడతులందరుజూడక॥ ...*

అటతాళము.

నెత్తిమీదనుచల్లపానయు నెలతకమరా-నుదటను-బత్తిబొట్టునుకావి చుక్క యుహత్తిమెరయక॥ కుత్తుకనునపరంజియుడ్డిగగుస్లపేరు సందిట-గుత్తనౌతాయితులబంతులుగుత్తమునురేక। చిత్తములురంజిల్లజనులకుజెలువు దోపా జూచుచు చిత్తజుని తేజమచు నెంచిరిచితములను॥ ... ... *

వ ॥ మరిన్నెటువలెను,

ఏకతాళము.

కాటుకరేఖలుకన్నులబెళుకులు।సీటులుగులుకగపాటలగంధి।ముక్కుముంగరయుముత్యపుకమ్మలు। చెక్కులతళుకులుచక్కరిబొమ్మ। నీలపుగాజులునిగనిగ మెరయగ । గాలియందియలుఘలుఘలుమనగక । తమకపుచూపులచిరునవ్వులుజూచుచు। గమకముతోడసుఘనముగనడిచెక॥ ... ... *

త్రిభంగులు.

గిలుకుమెట్టెలరవళిమొరయ-గొప్ప-కులుకుకుచములురెండునొరయ పలుకుపలుకుకుతేనెలొలుక- ముద్దు- కలికియినుదనువగలుకులుక। మోవితేనియవిందుదెలువ-మంచి తావిగంధముభుగులుకొలుపదీవిమించినసొగసునెరుప- లోచూడ - భావమునకుటిలంబుబరుప ॥ వారచూపులవిటుడుడాయ మరుడు- కేరిశరములుపొంచిప్రేయ ॥ మారుమలయుచువీధివెంట- జెలులతో-సారెసారెకునవ్వుకుంట॥ ..............................*

అప్పుడాకపటపురక్కసిచల్లలమ్మెనటమెటువలెను.

జంపె.

చల్లచల్లయనుచుచల్లమ్మెవింతలుగ- బల్లవాధరిజనులయుల్లములుజెలగ ॥ ఓచెల్లెసురలకునుమెప్పిదమునావల్ల-నాచల్లగొనరారెవాచెల్లెలా

రా॥ దెల్లుగా దేవతలుచల్ల కొరకయిమున్ను- దల్లడింపుచుగడలిదరువలేదట రే॥పగడములకీచల్ల పదియిత్తునీదిమిన్న-జగ మెరింగినచల్ల చపాలాక్షులారా ముత్యములకీచల్లమూ డేసిపట్ట రే- అత్యంత మోదమున నంగనామణులు॥వజ్ర ములకీచల్లవరుసతో నాల్గేసి - వజ్రిదాల్చిన సుధకు వచ్చునిదిజోడు ॥ అనుచు వీధుల వెంటనరచిచల్ల మ్ముచును-జనెనునందుండున్న సదనంబు జేరా॥ ... *

వ॥ అంతభూతకిమాయావినోదియైనందుని నగరుప్రవేశించితొట్ల లోనున్న చిన్నిముద్దులబాలునింజూచి నిట్టూర్పులు నిగుడించుచు దనప్రతిజ్ఞ చెల్లించుకోగలననిచల్ల బానడించియచ్చటనున్నయశోదతో నేమనుచున్నది,

జంపె,

అక్క-నేబోరుగూరు తీక్క-యెత్తినయటుల- చక్క-వచ్చిది నిటసుజల్ల మ్ముక్క-సను॥చిక్కి-తినినిచ్చటను జేపెజన్నులపాలు-కిక్కి-రిసెనక్క-క్క-నిక్క-మిదిచూడు ॥ గ్రక్క-నను జన్నిత్తు వెక్క-సములాడకుము- మక్క-వతో నిక్క-డ నెపుధ్యాహ్నమాయెక్క॥ ఒక్క-నిమిషంబయినవోయమ్మమాపాప- పక్క-జేరుకచనులపాం లెల్లదాగిపుక ॥

అనిమటి న్నేమనుచున్నది.

అటతాళము.

చిన్నిముద్దులపాపకిచ్చెదజన్నుబాలు-నీవును-గన్నతల్లివిగాననడిగెద సన్నుతాంగి॥నిన్న మొన్నటిబాలుడనుచును నెన్నినావో- నీమది-సన్నుతాంగిరొయరయనితడుసు వెన్నుడమ్మా ॥ నిన్ను నన్నును దెలియజూచును దిన్నగాను-వినుమిపు-డన్నిమర్మములను నెరింగినయన్నయితడు॥ పిన్నప్రాయము నా డెబిడ్డను గన్నదాన మిక్కిలిచన్నుగవలను బాలు చేపెనువన్నెలాడి॥ ...*

వ॥అంతయశోదకపటాత్మురాలిమాటలువిని సహింపకయేమనుచున్నది.

కరుచజంపె.

ఎవ్వతవెయెమాముద్దుగుమ్మా నీవు- నిందేలవచ్చితివెకొమ్మా తొట్టివద్దికిజే రరాకు-మాబిడ్డ - చుట్టుతిరిగెదవేమెనీవుపలుకుపలుకుకుదేనెలొలుక-నిచట గులుకకుముపో చిన్నిచిలుక॥ రచ్చలేల నెశిశువు చెంత - నికను-ముచ్చటలుచా లించు చెంత॥నాయ మెంతు వేపాపజాతీ - నీవు-మాయవాదివియేలనీతి-మొ గవారువచ్చేరులేవే- నీతో- మొగమాటమికచాలుపోవే ॥ నీటుచూపకునీవు మగువా-మాతో-మాటలాడకు లెమ్ము,తగవా॥

వ॥అనినవినిభూతకియేమనుచున్నది.

క॥పాలింప్లచేసెయుండగ । బాలిచ్చెదశిశువుకనినబనిగాదనచుణ॥బా
లింతరాలవిటువలె।బాలించకవలుకదగునెపడతులునవ్వణ॥

మరినేమనుచున్నది,

జంపె,

ఓయమ్మ యిదినీకు మాయమ్మ లయితోచ - నాయమ్మ గాదునా
పాయమ్మజూడు ॥ కాయమ్మతినగనా కాయమ్మవడదాకె-తోయమ్మలివ్వ
వేమాయమ్మనీవు । దాయమ్మలాడుదముతరుణినీమది మెచ్చ।నాయమ్మగా
వచ్చి గేయమ్మ జేరేణ॥

మరినేమనుచున్నది,

ఏకతాళము,

తోరపుచనుగవమర్ధము వెడలెడి-జేరిచూడవే చెలియరోనీవు ॥ భారమతా
రొమ్ముకుభారములాయెను - దూరమునడిచెడువారముగాము- నేరముగా
దీఘోరముజూడవే-క్రూరము సేయకవారిజగంధి - సారంబెరిగినసఖియ
వునీవుని-స్సారము చేయకువారిజనయనా॥

వ॥అనినవినియశోదయేమనుచున్నది,

జంపె.

ఇదియేమి పోరాయెమదిరాక్షినాతోడు - బదరకుముచాలించుపది
వేలువచ్చుణ- అదురుబెదురును లేకవది రెదవుపలుమారు - చదురురాలవుశి
శువునిమరరే పెదవు - కదియగంపునువచ్చుమదిరపానివినీవు - పదిరిదిగ్గున
నట్టెభ్రమశితిరిగెడవు ... ... ... ... ... *

అటతాళము.

ఒరులశిశువులనిమ్మటంచును నువిదనీవు-నూరక - పొరలినను నీకీయ
జూతురెపొమ్మవడిగ॥సురులకైనను దేరియచ్చటచూడరాదు - నీవిక-మరులు
పుట్టినదానివలె నేకొరలెదేమె ॥ కురులువీడగవిరులుజారగగొమ్మనీవు- వగ
చుచు-సిరులజెలగెడిశిశువునిమ్మనిచీరవలదు॥ ... ... ... *

వ॥ అనవినికపటవేషధారియశోదతోనేమనుచున్నది.

జంపె.

గొల్లవారముమేము పల్లవాధరివినవే - చెల్లబో నామాటకల్లగా
దమ్మ॥ పల్లవులకెల్లమరివల్లభుడునీప్రియుడు - బల్లిదుండతడుమాయెల్లరకు

విభుడు॥ మొల్లముగయాదవులవల్ల మీాఁదొరతనము-చెల్లుబడియయ్యేనికజెప్ప
నేమిటికి॥ ... ... ... ... ... ... ... ... *

వ॥ అనినకుటిలాత్మురాలిమాటలకు మెయిమఱచి విన్నట్లుయశోదయుగో
పికలుభ్రమశియూ రకున్నసమయంబునభూతకితొట్టితచేరంబోయిమాయ
లువన్ని గోపాల శేఖరుని నెత్తు కొనితనతొడ మీాద నిడుకొని చన్నుగు
డువనిచ్చినప్పుడెటువలెనుండెను॥

క॥జగములుకుక్షినినునిచిన।భగవంతుడుతానుచిన్నబాలునివలెనే। వగలా
డితొడలమీాదను-నగమానినయటులదోచెనాతికివెగటయి॥

అప్పుడెటువలెనుండెను.

అటతాళము,

తొడలుమీాదనుగొండవలెనేతోచెనేంతా - భూతకి - యొడలుమఱచ
టుతానుబన్నినయుపములెన్నేఁ - వెడలవచ్చునువీనినెత్తు కవేగమునునని
ప్పుడు-అడవసాగెనుమెదలనీయకయస్మచెల్లి - బడలికయిదేహంబుచొక్క-
నుబాపగాడు - యీాతడు-కడకబోకటుమాయబన్నెనుగంసవయిరి॥

వ॥ అనుచుదలపోయుచున్నంతకపటనాటకసూత్రధారియయినశ్రీకృ
ష్ణుండాకొన్నశిశువుచందంబుననావురావు రనుచుస్తన్యపానంబు జేసెనట
యెటువలెను.

త్రిపుట.

పాలకడలినిబవ్వళించిన పాలుమాలికలెల్లదీరను - బాలపాపడు విష
ముచన్నులపాలుద్రావెఁ ॥ ఫాలలోచనుడైనశంభుడుకాలకూటముమ్రింగి
గళమున- నేలనిలిపెనటంచునవ్వుచుగ్రోలెనతడు ॥ గాలిమేతలవైరినెక్క-
డిమూలముంపకువిషముగలదే - యేలతెలియకవచ్చె రక్కసిచాలభ్రమశి॥
పాలువిషమనియెంచ కేమోనీలవర్ణుండాటలాడుచు - బాలికామణిర
క్తమాంసపుపాలుద్రావెఁ॥

వ॥ అపుడు భూతకి కపటమాయలుమానియప్పటి నిజరూపంబుతోగూ
లెనటయెటువలెను॥

అటతాళము.

చిటెకుపాటుకునులేక స్రుగ్గెనువిటుకురాడి - ధరపై - చటుపటనసుబ
లుకొండవలెనేదైత్యురాలు। మాయవేషంబెచటడాచెనోమాయలాడిదేహ
ము - మాయకరమెతోచె నసుండుమానసులకు ॥ ఇటిరూపము గొల్లలునుగ

ను ట్టెభ్రమశి-హాయని-గట్టిగానిదిదయ్యమనుచును మిట్టిపడిరి. ... *

వ॥ అప్పుడుగొల్ల లేమనుచున్నారు.

త్రిపుట.

దుష్టతనమునవచ్చియిచ్చటనిష్ఠురంబులుపలికెనిప్పుడు- నిష్టతోనీశిశువు నెత్తెనుగష్టజీవి॥మాయబన్నుచునిన్నివింతలమరులుకొలిపెను నెవ రెరుంగని- కాయమునసీశిశువు నెత్తుకగాసిపెట్టె॥ తెలియమైతిమిదీనితసుకులు తెలిసి యుండినవీధిలోపల- నలియగొట్టటుపారవైతుమునాతియనక॥ *

వ॥ అంతయశోదభ్రమశి వికృతాకారమయియున్నరాక్షసింజూచి వెరగుపడియప్పుడేమనుచున్నది.

ద్విపద,

భూతకిగూలినబాగలియశోద - భీతిల్లిగొబ్బున బిడ్డను నెత్తి-నాయ న్నవెరచితేననుగన్నతండ్రి - మాయచేమేనులుమరచినల్లయ్యో-నిప్పుడు తెలి సెనునీలాగుదీని-చొప్పెల్లకనుగొనజోద్యంబులాయె - ననియనివగచుచునతి వెలుదాను- ననుమానమంతయునప్పుడుదీర - దేవుళ్లకును మొక్కి-దృష్టులు సి - కావిబొట్టును బెట్టికట్నముల్ ముడిచి - రక్షరేకులుగట్టిరఘురాము వే -రక్షించుమనుచునురమణిపార్థించె - బెరుగునన్నంబును బిండిదీపంబు రుతుగాకుంభంబుకుడుములుంద్రాళ్లు - సరగనివ్వాళించిసఖిపారవైచె ంతటనానందుడఖిలయాదవులు - వింతలాయెనటంచువిస్మయంబంది - వే మెపరతెంచివెలదిశరీర - మీగతిమన్ననుయిదియేమొయనుచు - గొండ కె వడిధరగూలినదాని- దండియెమ్ములమేనదనరినదాని - కరుకుకోరలనోం సగలిగినదాని - విరసంబుతనలోనవీడినదాని - కన్నులుబిలములగలినొప్ప దాని- చన్నులజిగిబిగిసడలినదాని- బెడదనాలుకమించిద్రేలాడుదాని- తో రినచేష్టలుదొలగినదాని - వికృతవేషంబుయివెలసినదాని - ప్రకృతిస్వభా రంబుబయలయినదాని- పాడుచొచెడుమోముపరుపైనదాని - చూడజూడ భీతిజూపెడుదాని- చూచిగొల్లలుకడుచోద్యంబునొంది - యీచిత్రమును వెన్నడెరుగమటంచు-గొడ్డండ్లగత్తులగొందికొంపోయి-దొడ్డరాకాసినిమం లబెట్టి- దరికొల్పబీనుగుదగ్ధమానపుడు - సరిలేనినొకమహాజ్వాలగా నెగ - పొగచుట్టుముట్టినభూనభోంతరము-అగరుగంధపుతావియమితమైతోచె రనరఖేచర సుముఖులందరును - నరుదందిచూడంగ నాశ్చర్యమునను -

దిక్కులవెలయంగదివ్యతేజంబు- గ్రక్కునశ్రీకృష్ణుకాయముండదగె. ... *

వ॥ అనినవినిపరీక్షిత్తుశుకయోగీంద్రునితోనేమనుచున్నాడు.

జంపె.

దురితాత్ములయిన దుష్టదానవికిపుడు - గరిమెతోమోక్షంబుగ లుగనేమిటికి ॥ హరికివిద్వేషియైయరుదుగా విషమిడ్డ- కరిగమనకేరీతిగలిగెమోక్షంబు॥ సిరివరునికథలెల్ల జెవులపండువులాయె - వరుసతోవినిపింపువరమానితిలక॥ ... ... ... ... *

వ॥ అనియడిగిననభిమన్యునందనునికివ్యాసనందనుండేమనుచున్నాడు.

శా॥ కామోత్క్రాంతతగోపికల్ భయమునన్ కంసుండువైరక్రియా। సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్ । ప్రేమన్మీరలుభక్తినేమునిదెచక్రింగంటిమెల్లైనను । ధ్యానధ్యానగరిష్ఠుడైనహరిజెందన్వచ్చుధాత్రీశ్వరా॥

సీ॥రాజేంద్రశ్రీహరిరచనలెల్లనుమీకువినుపింతుభక్తితోవీనులలర। భూతకిబోయినబొంగుచుగొల్లలు సంతోషముననున్న సమయముననుఁ । నీవార్తవినిచాలనీసునగంసుఁడు శకటదైత్యునిజూచిప్రకటితముగ । నావాడవైయుండినగుబాటుగాకుండబగదీర్పఁకున్ననుబంటుతనమె। యుపములన్నియునీయందెయున్నవిపుడు । దానవాధిపపూనుముదీనినీవు । మందకడకేగిశౌరినిమాయగాను। సరగుననుదెమ్ము రాకున్నజంపిరమ్ము॥ ... ... ... *

వ॥ అనియిట్లుకంసుండు చెప్పిననుప్పొంగికృష్ణుని దెచ్చెదననుచుబంతంబులాడి బండిరూపంబుదాల్చి వచ్చెనటయెటువలెను॥ ... ... *

త్రిపుట.

పాటిమీదనునున్న దేవరకూటిమీదనుగలువరంబను - మాటసామ్యమువలెనెదైత్యుడుమమతతోడన్-కోటివిద్యలు నేర్తుననుచునుగుటిలబుద్ధులుమదినిదలచుచు- దాటిగానొకయుపముబన్నెనుదానవుండు॥ ఆటలాడెడుబిడ్డవలెనేతేటగామరివీధిలోపల- మాటిమాటికిజిన్నబిడ్డలమరులుకొల్పెన్॥ చేటుదెలియకనందునింటికిజేరవచ్చెనుముద్దుకృష్ణుని - మీటుకొనికొంపోవదలచెనునీటుగాను ॥ చూటిగారానిచ్చితన్నెనుమేటిబాలుడుమాయశకటము- వాటుబడిధరగూలిదైత్యుడువడిగజచ్చెన్॥ ... ... ... *

వ॥ అప్పుడాశకటాసురని కళేబరంబు వికృతంబుగా బడియున్నవ

ల్లవులయుల్లంబులు ఝల్లుమనభయపడియున్నంతయశోదతత్తరపడుచుబా
లునినెత్తికొనిహారతులుదీసి శిశువునకు జన్నిచ్చుచున్నంత గొల్లలు తెలసి
నందునితో నేమనుచున్నారు॥

త్రిపుట.

బాలుడెక్కడబండియెక్కడబడినదయిత్యునిబలిమియెక్కడ - శూలె
నిదిగో చూడుధరపయి ఘోరశవము ॥ చిన్నబిడ్డలకలవియగునె చెడుగెదయి
త్యునిగీటడంచను- వెన్నుడయిననుపోరగలడె వెరపులేకా ॥ అనుచుగొల్లలుపు
రము వెలువడి యసురశవమునునీడ్చి వైచియు వినుతిజేసిరి బాలునప్పుడు వే
ల్పులెల్లన్॥ ... ... ... ... ... ... ... *

వ॥ అటుతర్వాత తృణావర్తునిరావించినీవు రేపల్లెకుంజనియేమరించికృష్ణుని
దెచ్చునికంసుండుచెప్పినవాఁడుమాయోపాయంబునవచ్చెనటయెటువలెను॥

జంపె,

సుడిగాలివలెవచ్చివడిగకృష్ణునిగొంచు। జడియకెగసెనుదానుమడి
యుటకువడిగ॥ బడిబడినినాకాశపథముజేరెనువాడు - కడువడిగకృష్ణుండు
మడనులిమివయించెన్ ॥ పడెనసురధరమీదమిడిగ్రుడ్లువెలికురికి - చెడిపోయి
తనమాయలడియాసలుడిగెన్॥ ... ... ... ... *

వ॥ అంతగృష్ణుం డెప్పటివిధంబుననున్న యశోదయెత్తికొని దృష్టు
లుదీయించి ముద్దులాడుచున్న సమయంబున నందుండుశిశువుకుగింకరులవ
లనిభయంబుదొలగునటుల బ్రాహ్మణులరావించి పుణ్యాహవాచనంబులు
చేయించి హోమవిధులుగావించి విప్రులకు గోదానచయంబులిచ్చి భోజ
నంబులతృప్తులంగావించి సుఖంబుండెనంతగోపాలుండుదినదిన ప్రవర్ధమా
నుండయియుండియాటలకుజొచ్చెనటయెటువలెను॥ ... ... *

ఏకతాళము.

బొజ్జనుజగములుపొందుగగదలగ- గజ్జలుఘల్లనికదువడినాడన్॥ కల
కలనవ్వుచు-గాంతులతోడను - జిలిబిలిసుద్దులజెలువముజూపున్ ॥ గోపబా
లులనుగూడుక వేడుక - క్రేపులమేపెనుగోవులచూపున్ ॥ గుసగుసవీధుల
గునియుచునడుచుచు - శిశువులనెప్పుడు చేకొనిదిరుగున్ ॥ ఇరువురముప్పొ
రనింపునరమ్మని - పరువులెత్తుమనిపందెముప్రేసున్॥తల్లిదండ్రులకునుల్లము
రంజిల- గొల్లవాడలనుజెల్లుగనాడున్॥ ... ... ... ... *

వ॥ ఇవ్విధంబుననాటలాడుచున్నకృష్ణదేవుండెటువలెనుండెను.

జంపె॥ తనువెల్లనంటినసుధరణీపరాంగంబు - ననువుగామైబూదినల మినస్లుండెన్ ॥ వరుసపాపటబొట్టు వరఫాలతలమునను - జూరుకుకన్నయితోచెజూపరులకెల్లన్ ॥ కంఠమాలికలోనిఘననీలరత్నంబు - అంగటికుతుకను కప్పమమరినట్లుండెన్ ॥ హారంబుచెలువంబుతీగైనయెమ్మెలయి - సారసాక్షుండొప్పెశంకరునిమాడ్కిన్॥ ... ... ... ... ... *

వ॥ అప్పుడాకాశంబుననుండి దేవతులుకృష్ణదేవునిరూపంబుజూచి భ్రమసినిశ్చయింపలేకశివుండనుచు నేమనికొనియాడుచున్నారు॥

క ॥ హరశంకరశివధూర్జటి।పురహరకైలాసవాసభువనవిలాసా।
శరణుశరణనుచుమ్రొక్కిరి। సురలందరుగుములుగూడిచోద్యంబగుటన్॥ *

వ ॥ ఇట్టిచిత్రంబులూరులెరుంగక కపటనాటకుండాటలాడుచునొక నాడుమన్నుతినగాజూచి బలభద్రుండుయశోదతో మనకృష్ణుండు మన్ను దినెననుచుజెప్పగా నాసఖిలలానుతనయునిచేరంబోయితనకరపల్లవంబులు చాచితనయునికేలుపట్టుకొనియేమనుచున్నది॥

జంపె. వెన్నపాలునునెయ్యివిరివిగాలేదనుచు-మన్నుభక్షింతురేమ ముడాగురించి॥ అన్ననీవునుగూడియాటాడవలెగాని - యెన్నటికినిటువంటి యేర్పాటువలను॥ నిన్నుశంగోలచే నేదబ్బళింతునో - యన్న నోరిటుచూపుమవుగాకనిపుడు. ... ... ... ... ... ... *

వ ॥ అనినతల్లినిజూచిమాయావాదిబిడ్డడుగడగడంవడకుచుగొట్టకుమనినోరుదెరచిననంచున్నవిచిత్రంబులు యశోదచూచెనటయెటువలెను॥

ఏకతాళము.

చంద్రసూర్యులునుజలధులుగిరులును- నింద్రాదినిర్జరబృందమంచుండెన్ ॥ తరులునదులుమునితతిదానవులును - హరిహరబ్రహ్మలనచటనుగాంచెన్ ॥ పక్షులుమృగములుబహుజనవితతిని - గుక్షినిజగముల కుదురుగజూచెన్॥ఆకసమునుమరియవనియుబచునాల్గు- లోకములెల్లనులోగనుపించెన్॥

వ॥ ఇటువలెబాలునియుదరంబుననిండియున్న బ్రహ్మాండంబుజూచిభయపడికన్నులుమూసికొన్నతల్లినింజూచిమాయావాదిబిడ్డడెప్పటి చందంబునగునియుచుబువ్వబెట్టుమని పోరుబెట్టినమాయచేనన్నియుమరచి బిడ్డడాకటజికేకనిపసిడి పళ్లెరంబునగాగినపాలుబోసియోగిరంబు వేగిరంబుననిడ

భక్షించిబాలులతోగూడియప్పటివలెనాటలాడుచున్నప్పుడెటువలెనుండెను॥

ద్విపద.

ఒకనాడుశ్రీకృష్ణుడుల్లంబునందు - నకలంకచిత్తుడయియాటలనలసి-వే
గమయిపరతెంచి వెన్నదెమ్మనిన- జాగుచేయుచుదల్లి సరగరాకున్న - బాలు
డాగెడుబానపట్టిద్రోచినను-బాలెల్లజిందినబడతికోపమున-నదలించుచునువ
చ్చునమ్మనిజూచి-పదరుచుగృష్ణుండుపరువెత్తెనపుడు-ధీమసంబునసుతుదెచ్చె
దననుచు-భామవెంబడినేగిపట్టుకోలేక- నిలునిలుబాలుడానీవెందుబోకు- చ
లమేలయిటురమ్ముసాధింపవలదు- యనుచుబల్కగతల్లియలసెనటంచు-మన
మునజింతించిమాధవుడంత- మెల్లనెపదములుమెలుకువనిడుచు-దల్లడించెడు
రీతిదత్తరపడుచు-వాపోవుబిడ్డనువడిగదొడ్డెత్తెచ్చి- రాపులేలనటంచురమణివే
గమున-దాగిడుదెచ్చియశోదతనయునిరోట - వేడుకతోగట్టివెలదింపుచును
నింటిలోపలికేగనిట్టట్టుచూచి- గట్టించికృష్ణుండుగ్రక్కునరోలు - జరిగించిమ
ద్దులసందునదూరి - తరువులబడనీడ్చిధరణిపయిగూల- ఫెళిఫెళిధ్వనులటుబె
ట్టుగామ్రోయ- గళవళంబందిరికడుదిక్కులందు- అంతగంధర్వులుయానం
దమునను-సంతోషచిత్తులైశాపంబుదీరి-గోపాలుబొడగాంచిగొబ్బునమ్రొ
క్కి- మాపాలిదైవమామముమేలుస్వామి - వాసనార్చితపాదవారిజనేత్ర
భాసిలుమీపాదపద్మముల్ గంటి- గలిగినఖేదముల్ గ్రక్కునదొలగె-విలసిల్లె
మోదంబువేడ్కలుప్పొంగ - ననుచునుతింపుచుహరికిమ్రొక్కుచును- జనరి
నాకమునకుసంభ్రమంబెసగ॥ ... ... ... *

వ॥ అనినవినిశుకునితోరాజేమనుచున్నాడు.

జంపె.

వీరుమద్దులవలెనువెలసియచ్చటనుంట- గారణంబదియేమిగంధర్వు
లకును ॥ ఈరహస్యముమాకునెరిగింపునున్నచో - నారాజుతోననియెనా
మానివరుడు ॥ నారదుండొకనాడునారాయణుంగొల్వ- దారకమునెన్ను
చుదానవచ్చునపుడు ॥ కూరిమితోనిద్దరునుగూర్చుండి లేవకను - నూరకున్న
నుదపసియుగ్రకోపమున॥ ఓరిమద్దులరీతినుండుమనిశపియించె - బోరోగిర
పుతపసియోరియనుచు॥ ... ... ... ... *

వ॥ అప్పుడుగంధర్వులు భయభ్రాంతులయి నారదునకు సాష్టాంగ
దండప్రణామంబులాచరించి వేడికొన్నగరుణించిమావచనంబుల మోఘం

బులుగావునమీరు భూలోకంబునమద్దులై యుండినగొన్నిదినంబులకుగోవిం దుండునందునియింట నవతరించి బాలుండై తరువులబెకలించునప్పుడు మీకు శాపంబుదీరుననిచనియెనంత వారలుమద్దులైయుండిరంతహరివలన శాపంబు దీరిదివ్యవిమానరూఢులైభక్తవత్సలుండైన భగవంతునిభొగడుచు జనిరనిమ రిన్నేమనుచున్నాడు. ... ... ... ... *

గీ॥ మాధవుండుపూనిమ్రాకులబెకలింప। వినియశోదగోపవెలదులెల్ల।ఒ లువరించుచరిగిబాలునిగనుగొని। కన్నువిడిచితల్లి గారవమున॥ ... *

వ॥ అంతయశోదసుతునెత్తికొని ముద్దాడుచుజలకంబార్చి భోజనంబి డినభక్షించియెప్పటివలె నాటలాడుచుగొల్లవాడలజొచ్చిదుడుకులు చేసిన వ్రేతలు చిన్నిముద్దులకృష్ణుని నేమి యనజాలక వాడవాడలచెడుగులుగూడి వ చ్చి యశోదతోనేమనుచున్నారు.

క॥ ఓయమ్మమీకుమారుడు । మాయిండ్లనుపాలుపెరుగుమననీడమ్మా। పోయెదమెక్కడికైనను। మాయన్నలసురభులారమానినివినవే॥ ... *

వ॥ అనిమఱి నేమనుచున్నది.

జంపె.

ఓశమ్మవినవెమీ కేశవుడుమాయిండ్ల । డాసిమెల్లనె వెన్న బోసె సె తొలుతా॥ మరివెనకనందరినిమరపించియిలుసొచ్చి - మరిపెమునప్రొద్దా గమరిపెగొందరికి॥ నొకయింటిలోజొచ్చియొకయింటిలోనాడు- నొగయిం టబవళించునొడ్డారమునను॥ ఒకవీధిలోజూడనొకవీధిలోనుండు- నొకరితో మాటాడునొకరికడుజీదు॥ ఒకరింటిలోవెన్నయొకరింటభోంచేయు- నొక రికొకరికనివాదొకవేళబెట్టుగా॥ ... ... ... *

ఏకతాళము,

అమ్మరోయాతనియెమ్మెలుచూచిన- సమ్మతమానాకోమ్మరోవినవే- ముద్దులుగుల్కగసుద్దులుచెప్పుచు- మద్దియలతోమరిప్రొద్దులుబుచ్చుగా ॥ పు వ్వుబోడులనురవ్వలుసేయుచు- నవ్వునుబువ్వులురువ్వుచు గేరుగా ॥ ఇంత వైఖరులనింతులజేరను- గాంతునిమర్మపుకథలవెయదుగుగా॥ చేలుతుద్రిప్పు చుమాతులుబొడుచుచు- నీతులుగాగొన్నిబూతులనడుపుగా ॥ చీకటిప్రొద్దు నకేకలువ్రేయుచు- మూకలుగూడినముదితలజెనకుగా॥ ... *

క॥ ఆడగజననీతనయుం। డోడకపెరుగెల్లద్రాగియొక్కించుకదా। గోడలిమూతినిబూసిన। గోడలుముచ్చనుచునత్తగొట్టెలతాంగీ॥ ... *

జంపె,

ఇటువంటిదుడుకులకు నెవరయిననోర్తురా - కటకటాయిక గొన్నికలహ వినుమమ్మా॥ మటుమాయకాడుమిమాధవుడు సతులతో-సటలు చేయుచు దినముసాధించునమ్మా ॥ గొల్లవానినివలెగొల్లవాడలజేరి- చెల్లుబోదొరతనము చెల్లనటెయమ్మా-నిన్నరాతిరియొక తెనిదురబోవగజూచి - చిన్నిచన్నులమీదకొ ౧న్ననలనునిచెనె ॥ చెట్టబట్టుకమగడుగట్టిగాదాననుచు-నట్టెయొకసతిరతిననలయించెనమ్మా॥ ... ... ... ...*

ఏకతాళము.

మందగమన నేమందకుబోగను-గంచువలాడుచుబొందులుగోరెనె॥చపలాక్షీ నేశయ్యనునుండగ-మంచివానివలెమంచంబెక్కె-నె॥ అరమరలేకను నతివరోయనుచును- గరములురెండునునురమునజేర్చెనె ॥ బోయిడెచటికిని బోయెనటంచును- న్యాయములాడుచు గేరుముజొచ్చెనె॥ ఆలునుమగడునునలసినిద్రింపగ-దేలునుబయిబడదెంపునవచ్చెనె ॥మేమును వేడిననేమనిపలుకవుపామును దెచ్చెదబదరకుమనియెనె॥ గబ్బిగుబ్బలలిగమకములనుచును- గొబ్బునగోరులునుబ్బుచునునిచెనె॥ చక్కెరమోవిదిచవిగలదాయని- చక్కగబంటనునొక్కటుజరిగెనె॥ ... ... ... ... *

గీ॥ఇంతియీరీతిశ్రీకృష్ణుడేపురేగి । చెలులనందరిగుట్టులజెరచెనమ్మ।తరుణిమగవారువిన్ననుతప్పుగాదె । వినుముసీబిడ్డకరదలవింతలెల్ల ॥ ... *

వ॥అనుచుగోపాలవిలాసంబుజెప్పిరటయెటువలెను -

జంపె- పల్లవాధరియొక తెపసుపుబూయగజూచి-మెల్ల మెల్ల నెవచ్చిగిల్లితాబోయెనె-సతిపతులునిద్దరును సరసమాడెడువేళ - హితవుగానటుచేరిరతిగతులదెలిపెనె - కంజముఖిరమ్మనుచు సంజకడదాబిలిచి-మంజువాణులమననురంజిల్లబలికెనె-దాపురముగా మెక్కి-తరుణిజలకంబాడ - వీపుదోమెదననుచు రాపాడెనితడు - వెన్నముద్దలుతాను సన్నగా మెక్కగా - సన్నుతాంగిరొయదుగజన్నెడిసెనమ్మ- అప్లుచప్లను బెట్టియుట్లపయిదాచగా మెట్లకొయ్యను నెక్కిచట్లొడిసెనమ్మా - దేవుడెవ్వడుమీకు దెరవలారాయికను - దేవుండనేననుచు దెలియగాబలికెనె - మరుగుననుదానుండిపెరుగుజిలికెడుసతిని - సరగదుడుకులుజేసిజరిగినాడమ్మా- అదరుబెదరును లేకనిదురవోయెడుదాని-పదరిపైబడియట్టె బెదరించెనమ్మా ॥ ... *

వ ॥ అనిమఱిన్నేమనుచున్నాడు,

త్రి పు ట-

ఆరవారము చేసి సతులతో నల్లపనులకు జొచ్చెనతడను- దారుమారు లు సేయదొరలకుదగ వె చెపుమా ॥ పోరుచును నే వేళ సతులతో బొందుకోరెడి మేరగాదిది - వారిజాననయోర్వగా నెవ్వరికివశము॥ ఆరుదూరును జేసెనే యాయంబుజాక్షుడుసద్దు సేయుక-కోరికను తాదీర్చుకొన్నను గొరతగాదు॥

వ॥ అనియిటువలె గోపకాంతులు మొరలిడిన యశోదబలుకకయూరకున్న గోపమువచ్చి గోపిక లేమనుచున్నారు॥ ... ... ... ... *

త్రి పు ట.

కోమలాంగిరో నీకుమారుని మోముగనియిటులూరకున్నను - మేమితనిమడుకులకు నోర్వమి కేమియనదో ॥ చుట్టిపట్టుకకట్టి వేతుముగట్టిగామరినీ దుపట్టిని-రట్టులెల్లనువానుమనుచునురమణి మేము॥ ఊరి కేవినపరెలసతులను గోరియుంచు రెయెవ్వరయినను - వారిజానన మేరగాదిదిమీరినడువక॥ *

వ॥ అనుచుగోపికలు కఠినవచనంబులాడినవారితో యశోదయేమనుచున్నది॥

జ ం పె,

చెల్లనోపనిబిడ్డకొల్లలాడెనటంచు - గొల్లకాంతలుమీరుగొల్లుసేయుదురె-అంగనామణులారయంగళ్ల బెట్టకను - సంగతిగజూడ రేసఖులారమీరు - కపటమించుక లేనికలికికృష్ణునిమీద - జపలాక్షు లందరును నేపము లెన్నుదురే॥

వ॥ మరి న్నేమనుచున్నది-

త్రి పు ట.

చెక్కుమీటినపాలుగారునుజక్కనయ్యాను బెక్కుభంగుల - మిక్కుటంబుగదప్పులెన్నెదరక్కజముగ - పోరెమీకును బొద్దుజరుగదుసారసాక్షుడుజారుడనుచును - సారెసారెకునుడువవలదిక చేరిమీరు - ఏమియెరుగనిచిన్నియన్నను గాముడంటేసామినవ్వడె - భూమిలోపలనిట్టివింతలు బుట్టెనిపుడు - ఎన్నిదోషములున్న నైనను నితనిదుడుకుల నెన్నవచ్చునె - పిన్నతనమున జేయుపనులవిప్రియముగా వే॥ ... ... ... *

వ॥ అనియిట్లుపల్లవకాంతలయుల్లంబురంజిల్లవారలసరసోక్తులలాలించితాంబూలంబు లొసంగి ప్రియవిహిత వచనంబులదృప్తులం గావించిపొమ్మనిపనిచిమూలదాగియున్నసూతర్ణగోపాల శేఖరుని నదల్చిననంతనందుండు

బలరామకృష్ణులదూడల మేపుమని నియమించిన వారలు తమయీడుబాలురగూడిదూడల మేపిరటయెటువలెను॥

జం పె.

మచ్చికలనందరునుబచ్చికల పట్టేరిగి - హెచ్చులుగ మేపుచుండ్రిచ్చలుగనపుడు ॥ నీటివంకలకదుపునీటుగామరలించి - మాటిమాటికి గెరలియాటలాడుచుమరు ॥ పువ్వుగుత్తులుగోసిరువ్వుచునుగృష్ణుండు - నవ్వుచునుజివ్వరనియవ్వలికిదాటుల ॥ పోటినుడ్డలువెట్టి పోటిపోటియటంచు - మేటిగామీటుచురుచాటించువేడ్కల ॥ పుల్లచెండ్లనువింతపుట్టేరా యిదిచూడుగొట్టేదనుగోలచేనెట్టుకొనిపరువల ॥ బిళ్లగోటులెగరంగ ఫెళ్లుననుబోగొట్టి - కేళ్లురికిమలయుచురుత్రుళ్లుచునువేగల॥ ... ... ... *

వ॥ మఱియునాటలాడెడుక్రమంబెటువలెను॥

ఏ క తా ళ ము.

దాగనబూచులులేగలమరువున- దోగుచుగొందరుదాగుమరచటల॥ పిల్లదిండ్లకునుగొల్లలపిల్లలు - చెల్లుగనుస్థలుమల్లడిగొనుచుల ॥ చిమగుడులాడుచుజడిముడితోడను-విడబడినెగడినదోడబడికడిమిల ... ... *

వ॥ ఇవ్విధంబున నాటలాడుచు గొన్నిదినంబులు దూడలు మేపుచున్నంతనొకనాడుబ్రహ్మదేవుండుకృష్ణునిమహిమంబు తెలియుటకు సంగడిగొల్లబాలులదూడలను నొకగుహలోదాచియాబాలులకు దూడలకునాకలిదప్పులులేక యనువుపరచియున్నంతగృష్ణుండు పరమేష్ఠిపన్ననకపటంబు తెలుసుకొని తానుబాలులరూపంబు దూడలరూపంబుదాల్చి విహరించెనటయెటువలెను॥

జంపె. ఏయావుకేదూడనాయావుకడజేర్చ - బాయకదిమ్ముతో బ్రావాగెనపుడు ॥ యేబాలకేతల్లియాబాలకడనుండి - గోపాలశేఖరుడు తాబాలుడాయె ॥ మరులుకొనితముగన్నమమతలేతలపోసి- మరలకుండెనుశౌరిమాయచేమనెను ॥ సంతతంబీరీతిసంతోషమునబొంగ - సంతులనుచునుగొల్లసతులుధేనువులు॥

వ॥ ఇటువలెనొక సంవత్సరంబు హరివిహరించినంజూచిబ్రహ్మతన మనంబున నాశ్చర్యపడుచువచ్చి లీలావినోదుండయిన గోవిందునకువందనంబులాచరించి యనేకవిధంబులవినుతించి తానుసంవత్సరంబుదాచినవల్లె

వబాలులముందర నునిచినమహాధవుండునవ్వి చతురాననుని గరుణించి యతని వీడ్కొలిపి తా నెప్పటి భంగివర్తింపుచుండెనంతనంథుండావుల మేపంబనిచి నగోపకులగూడి తానును నావుల మేపెడు క్రమంబెటువలెను.

జంపె.

పెనుగు మీగడబువ్వ సరగ దెచ్చుని మెక్కి - యరిగి యావుల మేపమఱిగెనా శౌరి॥ మందనావులబిలచెనందనందనుడపుడు-నందముగ వేవ్వేర చందమమరగను॥ రాపాలకడలి రా రానీలగిరి రావె - రాపసిడి చిలుక రారా యించ రావే ॥ రాకింది పెదుండేవి రావెలయ మేల్ మంగ - రాకనకవల్లి రారా వెనాంచారు ॥ రమ్ము భారతిగౌరి రమ్ము గోదావరీ - రమ్ము జాహ్నవి యమునరావె శ్రీలక్ష్మి॥ రమ్ము నర్మదా కృష్ణ రమ్ము వేకావేరి-రమ్ము బంగరు కొం డరా చందమామా - రాకల్పతరు రావె రావె చింతామణి - రా కామధేను వా రావె భూదేవి ॥ అనుచుబిలిచిన వేల్పులాలకింపుచుమింట - తనుబొగడగ మఫులనుదరలించెనపుడు॥ ... ... ... ... ... ... ... *

వ॥ అంతగృష్ణుండు పశువుల మేపజనుసప్పుడెటువలెనుండెను॥

అటతాళము.

పిల్లగ్రోవులచికిలిసవ్వులుజల్లులపర - సొగసున- బిళ్లమెప్పిసుబిగువు ఫ ట్టయుసుల్లసిలరగా ॥ తలనుజుట్టినపికిలిసింఫపు దండమెరయ సుమటను వెలయకస్తురినామమేర్పడ వేడ్కలమరగా ॥ పరశురాముని వలె నెగొడ్డలి వహసతోను-రాముడు- సరసముగ భుజమందుమనిపింగొ నిజనియెనపుడు ॥ ఆల కిమఫులవెంటసంగటిబాలుపలతో - జెలగుచు - మేలమాడుచునడవులందు న మేపదొడగెగా॥

వ॥ అప్పుడెటువలెనుండెను.

అర్ధచంద్రికలు.

గుంపులనుజూచు మందులను మేపుగా। కోనలగడుచు గానలమేపుగా॥ హోయెయనుచును నేలలువాడుగా॥సంగడిగొల్లల గొంగడులాడుసుగా॥ తేనె లుఫలములు తెచ్చినిపిలుచుగా॥జాడరబోపుచునీడలనిలుచుగా॥ ... ... *

వ॥ ఇటువలె పశువులమేపుచు నచ్చటశృంగారంబు లెన్నరటయె టువలెను॥

జంపె.

పొన్నగన్నెలుపున్నయున్నతముల్ మిన్నసన్నన్నయీంబాగు నెన్నవలెమా

నా॥ వెలగలిచ్చట చాల వెలసె వముబలగముల - జెలగి ఫలములు గలిగి చెలువ
ములు మెరయఁగ॥ పనసలీకోనలో నెనసియున్న దిగదిసి - మనసుదని సెనటం
చు మాధవుడు చూచుఁ॥ చూతములగుంపులివి చూడ వేడుకలాయె - చూతమని
గొల్లలతో సొంపుగా నరుగఁ॥ పొగడలీగిరి చెంత నెగను వేడుకతోను - బొగ
డసగు నీతరుల పొందికలు శూనము॥ ... ... ... ... ... *

వ॥ అనుచు పశువుల మేపుచు వనశృంగారంబులు వర్ణింపుచున్న శౌరివి
లాసంబు చూచి యచ్చట గోనలలో విహరించు కిన్నెరాంగన లేలలు బాడిరట
యెటువలెను॥

యేలలు.

చాపవలె నేయిుామలాడీ - వీపును భువి మోపు మోసి - కాపువలె నే
భూమి నున్నెను - గోపాలబాల - రాపులాడ వెడలి వచ్చెను॥ అబ్బురము
గా బలినినడిగి గబ్బి రాచగముల దెచ్చి - యుబ్బుచును గడలిగట్టెను - గోపా
లబాల - అబ్బురముగా నవ్వుతమొసగెను॥ మాయదారి భూతకిని - మా
య జేసి బండిన్ని - గాయక మున సుడిగాలిని - గోపాలబాల - రోయుచును
సులిమివయిచెను॥ ముద్దుగులుకి తల్లి రోట - పద్దులాండి బంధించంగ - మద్దులను
గెండించెపు - గోపాలబాల - ముద్దులాడ జేలులబిలచెద - గొల్లవాడలె
ల్లజొచ్చి గొల్ల కాడయి వెన్న నెకి - మెల్ల మెల్ల చెలులనే చెదు - గోపాబాల -
వల్లవుల భాగ్యమెట్టిదో - హింసపరుల నడచి పరము - హంసులయిన మును
లబ్రోచి - హంసగమను డుమిమ్ము బొగడగ - గోపాలబాల - కంసుమద
మాత్సర్యము గొట్టు దే॥ ... ... ... ... *

వ॥ అనియిటు పొగడెనకిన్నెరకన్నియలను దమకరుణాకటాక్షవీక్ష
ణంబుల పృత్తిలం జేసి రామకృష్ణులు గోపాలకులాపులమరల్పుకొని సాయం
కాలంబున మందసు వచ్చెడు క్రమం బెటువలెను॥

త్రిపుట,

పొదవులోపల బాలు చేసిన మొదవు లెల్లను మోర లెత్తక - కదిలెలే
గలపల విహాయస్సునికమువులఫుడు - బింకముగ గాల్ త్రవ్వి రంకెలు ఘెల్లుగా
మోయించుచున్నవి లె - వంకజూచిన బర్వతంబులవలెనె దోపఁగ॥ జిట్టిజిట్టి
నన్నట్టు లెత్తుక గుట్టముల వలెమముకు కోడెలు - నట్టనట్టల నడిచెగదు పులన
డచముసపుడు॥

వ॥ అట్టికమపులమమందకు దెచ్చి పాలుపిండుచు నిట్లుదినదినంబును వింతులుగులుకుచు నావుల మేపుచున్న రామకృష్ణులు ప్రలంబతృణావర్తబకధేనుక కాళిమొదలయిన రాక్షసుల సంహరించి చెలంగుచు నొక్కనాడు ప్రొద్దున మేల్కాంచి పాలుపిండి సద్దులుగుడిచి కృష్ణుండొక్కరుండు గోపాలుల గూడి కొన్నిపశువుల మేపుటకు గదలి వేణువులూదుచు కొమ్ములుపూరింపుచు గేకలు వ్రేయుచు గొంగడులెగరవయిచుచు సరసంబులాడుచు జనికానల ధేనుగణంబుల మేపుచున్న మార్గంబుదప్పి కాళింగుని మడువునకు బోవుచున్నంత గదుపులకడ్డంబునిలిచి హరితో వల్లవులేమనుచున్నారు॥

జంపె.

కాళింగుడనువాడు కాకోదరాధిపుడు - బాళిచేనిండుడి భామలను గూడి॥ తాళిమించుక లేక తనదు విషవహ్నులను- గూళుడయి జీవులను గూలంగ జూచుర॥ వ్యాళములు తను గొల్వ వర్థజీవయియుచట- వేళ వేళలయందు విహరింపుచుండురా॥ ... ... ... ... ... ... ... ... *

అటతాళము.

పక్షిజాతులు విడిసె నేసియు భస్మమాను - మృగములు ఆక్షణంబే మడియు సుడిబడియచటి కేగరా॥ మంటలెగయగ విషము గ్రక్కుచు మడుగులోన - నుండును - జంటబాయకి చెలులు తాను సంతతంబు॥ దేవదానవులైన జేరరు తెలివితోడ నచటికి - జావు నిజమని యెంచి యేగరు చాల వెరచి॥

త్రిపుట.

గాలి విసరిన మనుజవరులును గాసి చెందియు మూర్ఛవోదురు - కాలకూటమునైన మించిన గరళమయ్యా॥ మేము వెరుతుము నిక్కమచటికి రాము మేపులు లేవె పశులకు - తామసించక రమ్మటంచును దరువులిడిన॥ వర దిగొల్లలు విష్ణుదేవుని వేయివిధముల వేడికొన్నను సంకుసేయక యిట్లులనియెను సాహసమున॥

జంపె,

వినుడు గోపకులార వినుడు నేనుండంగ - బెనుబాములెన్నైన బెనచి వయిచెదను ॥ ఘనవహ్నులే తేరగ బళించి మ్రింగెదను - పనిబూని విషమయిన బట్టి మ్రింగెదను॥ అనుమాన మేల మీరాలకదుపుల జేరి - వెనకనుండుడటంచు వేగ తానరిగెరా॥ అలసాగరము రీతి నలలు సుడులును గలిగి - బలు ఘోరమగు మడువు పరికించెనతడు॥

వ॥ అప్పుడా హరి యెటువలెనుండెను.

## ద్విపద.

అయ్యెడశ్రీకృష్ణుఁ డామడువులోన - జయ్యనముమకగా సమకట్టియ పుడు. బిల్లగోచియు నెమలిపింఛముటుంచి- చల్లడంబునుదట్టిచకగాగట్టి- దగ్గర నెకపొన్నతరువుపై నెక్కి- యగ్గలంబుగమించియతిసాహసమున - జట్టిరీతినిజగజట్టియైనిలిచి - యట్టిట్టుచూడకనపుడటుకదిసి - కూకటిముడిజార కుప్పించియెగసి - తూకువనీటిలోచుమికెనాతుణమె- అప్పుడుఘూర్ణిల్లెనంబుధిరీతి-నప్పుడు బిందువులాకసంబంటె - గుదిగొన్నధ్వనులచేగూర్మ రాజడగె- గదలిభూతలమెల్ల గడగడవడకె - ఘుమఘుమార్భటిచేత గులగిరులదరెన-మితమయిమందరంబబ్ధిలోదిరుగు- చందానకృష్ణుండు సాహసంబొప్ప- పొందుగానీదుచుబొరలుచు గెరలి- యామహారభసంబుహల్లకల్లోల-మామహారవమునకమరులు బెదర- సోమకుకొరకుగాజొచ్చి వారధిని - భీమవిక్రమకేళిబెళుకులుచూపు - మచ్చంబుకైవడిమచ్చరంబునను - నచ్చట మడుగులోహరియుండెనంత॥ ... ... ... ... *

వ॥ అంతమందలోదుర్నిమిత్తంబులుపుట్టినబొడగనినందయశోదాదులు గోపగోపికాజనంబులు గుంపులుగూడి బలరాముడు వెంటరానందరు మడుగు జేరవచ్చి కృష్ణుండు మడువులో దుమికిన వృత్తాంతంబువిని గోపికలేడుచుచున్నారు. ................................ *

## త్రిపుట.

అక్కటలేక్కక నరవసాగెను నుట్టునుట్టనియాలకదుపులు - వెట్టికొలి పెనువిసుడునందని కుట్టనిన్ను ॥ ఈడుజోడైయున్నగొల్లలుకూడమడుమికెడ మనుచుమరిమీ- జాడవెదకుచువచ్చిరిదిగోచూడవయ్యా ॥ తల్లిదండ్రులుబలుడుతక్కిన గొల్లలెల్లను దరలివచ్చిరి - యుల్లములురంజిల్ల రావేయుల్లసమున ॥ పంచబాణునిగన్న చక్కనిమంచిరూపరివనుచుసతతం - బెందిమోహముపెంచియుంటిమిపించజూట॥ ........................ *

వ॥ అంతయశోదవగచుచు నేడుచుచున్నది.

## అటతాళము.

నిన్నునిమిషముగానకున్నను నీరజాక్షా - యుగములు యెన్నియామెనె తెలియ రాదేదిన్నికృష్ణా ॥ వెన్నుడనుచును నమ్మియుంటిమి - సన్నుతాంగా - నిన్నును - నెన్నిభవముల నెన్నదరమా నెన్నటికిని ॥ మున్ను

నోచిన నోము ఫలమున నిన్ను గంటి - జక్కని - యన్నరావే నిన్ను జూచె
ధగన్నతండ్రి॥ .................................. *

త్రిపుట.

నీవు బుట్టిన దినము మంచిది నీరజాసనుడాది వేల్పులు - దేవశతవర్షంబు
లాయువు తేజరిల్లు ॥ అనుచునద్దినమునను బలికిరియమరులెల్లను బ్రతినలాడు
చు - ననువుగాకనుదప్పునటరాయబ్జనాభా ॥ దినదినంబును నిన్ను జూచుచు
దీర్ఘకాలంబుండవలెనని - మనమునను దీవింతునెప్పుడు మమతతోడ ॥ చి
న్నపాత్రియము వాడె వేత్రితలు వెన్నదొంగిలెననుచు జెప్పగ - నన్ని వినుచును
నున్న విధమున నున్న వేమో॥ .................................. *

అటతాళము.

అడవులందు ననాల మేపను ననిపిరనుచు - మడువున- దడప్రుముసలెప
ననుచు నీసుదిసలచినావు॥ రోటగట్టినటంచు నీమది రోషమునను సిప్పుడు నీటి
లోపలగాగియుంపను నీకుదగున॥ మున్నది నేననియన్నను డిపినమచ్చరమును-
దెలియి సున్నవిధమున దోచుచున్నదియూహజేయుగ॥ ... ... ... *

వ॥ గోపకాంతలజూచి యశోదయేమనుచున్నది.

త్రిపుట.

అప్పరావే బుప్ప బెట్టెటకనుచు బిలిచినముద్దుకృష్ణుడు - రవ్వలకు దామ
డువులోపలరవ్వల నెనో॥ కొమ్మలారా పిలువరమ్మా కోరి కృష్ణుని రమ్మటంచు
ను - మమ్ము గానక దాగినాడో మడువులోన॥ పని సేయుమ భామలారా పాపా
ముగాడిమియనుచు జెప్పిరి - తాపసించియురాడు వెడలియదేమొకా॥

వ॥ మాటెన్నేమనుచున్నది.

అటతాళము.

అమ్మరమ్మని పిలువవేమిరయంబుజాక్షా - ముద్దుల - గుమ్మలో మాటా
డవేమిర కోపములాంగా ॥ బలుడు సారెకు హెచ్చరించిన బాగుగాను - నన్న
తో-బలుకరావని యూరకుండుట ప్రతినగలదో ॥ గోపకాంతలు గొల్లలె
ల్లను గోరినన్ను- జీరిన- రావు లేలను వెడలి రాగదె రాజవదనా॥ నిడుపభుజగం

బున్నదనుచునునీవెరింగి-యిచ్చట-మడువులోపలనుండతగునామందవిడిచి॥

వ॥అంతయశోదయెటువలెనుండెను.

త్రిపుట.

కొడుకరమ్మనిపిలుపుపిలిచిననోయటంచునుబలుకకుండిన- మడుకు తనమునసీటిలోపలమునుకజూచునా ॥ సురలవేడుచునుస్మరనుచును సోలి ధరపయినెరిగెనూరకె - పెరలిపొరలియుబలువరించునుబాలతియపుడు ॥ లేగబాసినమొదవురీతినిలేచియరువగసాగెవెన్నుడు - దోగిరాడనిగొప్పవెలుగునవోయజాక్షి॥ ... ... ... ... *

వ॥అంతనందుండేమనుచున్నాడు,

అటతాళము.

పరినీసరి వచ్చువారలుకోరిచూడ-మారుని-గేరుచక్కనిరూపుగలినవారిజాక్షా॥ దేవుడనుచును నెంచిచూతుము తెలివిగాను - నెప్పుడు-నీవుదిక్కని నెంచిచూతుమునిక్కముగను॥ మంపటావులసకలసంపదమహిమస్లై- నీవయి-యుండువెలయును నీవు వెలయుముపొందుగాను॥ ... ... ... *

వ॥మరియేమనుచున్నాడు,

త్రిపుట.

దారిగాచనిగొల్లబాలురుచేరిచెప్పినవినకయిచటికి-మీరివచ్చిరె ఘోరవిషముని పేరువినియునా ॥ ఘోరినీరును లేచుపాలమునభూరివనమర్గంబులందున-క్రూరభుజముచేరవస్తిరెకృష్ణకృష్ణా॥ ... ... ... ... *

వ॥ఇట్లువగచుచుసమీపంబుననున్నహలధరునింజూచియేమనుచున్నాడు॥

జంపె.

పగవానివలెనీవుతెగువతోజూచుచును - వగవకిట్లువలెనుండదగునె బలరామా ॥ తగనీకుదమ్ముడనిమిగులజగములువొగడ- నెగడియీపామునకె నగుపడునెచెప్పుమా ॥ వగగులుకునీబాలనగుమోముజూచినను బెగడొందుగాకతానగుదేలపడును॥ ... ... ... ... ... ... *

వ॥అనివగచుతండ్రింజూచిబలభద్రుండేమనుచున్నాడు.

అటతాళము.

అయ్యాయిటువలె వగువనేటికినెయ్యమునను భూతికిజయ్యానను జ

న్నిచ్చిబ్రతికె నెగయ్యాళించి ॥ వెయ్యపడగలఫణుల వేలశకటము విరుగగాచు - ద
న్నెను-నయ్యా యోహో మృతిబొందెదనుజుడు కుయ్యాకిపుడు॥ దయ్యాలైనుడిగాలి
యెత్తుకకయ్యామియ్యా - మింటను - నొయ్యారముతోనులిమి వైచెనున
య్యాయితడు॥ ... ... ... ... ... *

వ॥ మఱియున్నేమనుచున్నాడు॥

ఏకతాళము.

పాముపాముని యెడు పామర మేటికి- బాములబెట్టెడిసామియునిత
డు । విషము విషమటని వెరిచెద రేటికి - విషగళ ధరునకు విషములుగలవే॥
ఘాటిగవారధి మేటిగనీ దెను- నీటికి వెరువనీ కేటికదం ద్రీ॥ వెడలివచ్చునిక వేగ
మెకృష్ణుం-డడలకుడనుచును హలధరుడనియెః॥ ... ... *

వ ॥ అంతయశోదాదులు గోపగోపికాజనంబులు హరిరాకకెదురుచూ
చుచునుండి రంతకృష్ణ దేవుండామడుగులోనీదులాడుచుండెనటయెటువలెను

ద్విపద.

అంతనామాధవుండామడుగులోన - సంతసంబుననీళ్లుచల్లుచురాగ-
గులుకుచు బెళుకుచుగొంకకయతడు- జలములతిరిగెడుచప్పుడాలించి - విని
యుగాళియుమాహావిస్మయంబొదువ - దనమదిలోనొల్లుదలపోయదొడగె-
దేవదానవులైనదృష్టింపరాని - యీవనంబిటుచొచ్చె నెవ్వాడటంచు - గో
పంబుదీపింపగోరలుదీటి - పాపరేడప్పుడు పరువునవచ్చి - పన్నగపతిమీఁద
బండిన వాడు - కన్ననవిలుకాని గన్న వాడనుచు - గారవంబున నెఱుంగక
చంపెదనుచు- భావంబులోపలబగయు రెట్టింప- వెగటున బరదెంచి వెన్ను
నిగరచి - పొగలువంటలు లేవభోరునవిషము - గ్రక్కు-చు రేన్నెగాటులుం
చినను గ్రక్కు-న గృష్ణుండు గాళింగు నెదిరి - పట్టితో సిన బొక పటురో
షమునను - జుట్టుక యొడలెల్లనుడిబడజేయ - గాయంబుహరిజంపకల్లల్లవి
డిచి - పోయిన వెరగంది భుజగవల్లభుని - నడుగునజిమ్మి యనటుపడవైచి
పడిగలపై నెక్కి-పదతాడనముల - నలినలిగాద్రొక్కి- నవ్వుచుగెరలి - తలల
పైగృష్ణుండు తాండవమాడె॥

వ॥ అప్పుడు గోపకులచక్రవర్తి - సర్పములకుచక్రవర్తిశిరములపై
నెక్కి-నాట్యంబు సలిపెనటయెటువలెను॥

## ఏక తాళము.

కేరుచునవ్వుచు గేకలుఁ వేయుచు- బేరెము వారుచు బెంపుతో నాడెఁ॥ చేతులుద్రిప్పుచు జెలగుచుమురియుచు - బాతరలాడెడు పద్ధతినాడెఁ ॥ కూ ళుండితడనికొ ద్దినవిడువక తాళముదప్పకతరుచుగనాడెఁ ॥ధిక్క-ధిక్క-తోం ధిమికిటయనుచును- ధక్క-ధిక్క-మనిదరువుతో నాడెఁ ॥ పాటలుబాడుచు నీటులుగులుకుచు- గాటలుగలదనికడువడినాడెఁ ॥ లోకములెల్లనులోగను దేవుడు- జోకతో ఫణిపైసొంపుగనాడెఁ ॥ సురసతులందరువరసతో మింట ను- విరులుగురియదా వేడుకనాడెఁ ॥ పురములుమూడునుబొరిగొని శంభు డు- అరుదుగ దాండవమాడినభంగిఁ ॥ కడువడిబదములుఘట్టన సేయగసుడి వడిభుజగమువడి సెడెనపుడుఁ॥ ........................... *

వ॥ మఱి నెట్టువలెనుండెను.

## అట తాళము.

నిత్యనిర్మలమానివరులను నెనరుతోడ- బ్రోచిన- సత్యసంధుడు భోగిఫ ణముల నెక్క-యాడెఁ॥ నాటముగనీపాముతలపైనీటుగాను- గృష్ణుడు- ఆట లాడుచుబాటపాడుచునీటుచూపెఁ॥ పుట్టుగిట్టును లేకజగములుపొట్టనిడిన దే వుని- నెట్టుమోసెనెత్తిమీదనుబుట్టుభోగి ॥ అనుచుబొగడుచుగృష్ణదేవుని యాటజూచి- దివిజులు- వినుతిజేసిరిగుములుగూడుక వేడ్క-మీరఁ॥ *

వ ॥ ఇటువలె దేవతలుపొగడుచున్న శబ్దంబులాలకించి జగదీశ్వరుండని తలంచి కాళింగునిభార్యలయిన నాగకన్యలచ్చటికివచ్చితమ పురుషుని శిరస్సు లమీద గేళిసలుపుచున్న పరమేశ్వరుని బొడగని వందనంబు లాచరించి యే మనుచున్నారు॥ ........................... *

క॥ ఓ దేవత్వత్ప్రభావము । లే దేవుండెరుగు గానని ంతుల నేలఁ । మీ దయచే బాలింపుము । వేదప్రియ వేదవేద్య విశ్వేశహరీ॥ ... ... ...*

వ॥ అనిపొగడిమరి నేమనుచున్నారు-

క॥ పరిపరివిధములనాట్యము। మరిమరినాడంగనురగమానినులపుడా। సి రివరునియెమరనిలిచియు। హరిహరిశరణనుచు మొ్రొక్క-రంగనలంతఁ॥ *

వ॥అప్పుడు చేతులు మోడ్చి పాదపూజలు చేసి బాలపాపనితో నేమనుచున్నారు

## జంపె,

మిన్ను దెలియకహుమ్మహుమ్మనుచునె దిరించి - యెన్నుమలన్నియు

విరిగిపోమ్మసిలెనయ్యా॥ దొమ్మిపాములుదిశమకమ్మితనుగొలువంగ- దిన్మ రీడై మొడలు తెలియగ నేయుండెర॥ఇమ్మమాకభయంబులిమ్ము వేగమెనీవు- తెమ్మమీదయమదినినమ్మితిమిచూడు.................. *

వ॥ అనిమఱి న్నేమనుచున్నారు.

జంపె,

తొలుతపరువులెత్తదొంగయాతడుగాడు - మలసిమోచుటకితడుమం దరముగాడు ॥ ఇలచుట్టుకొనిపోవనితడుదైత్యుడుగాడు - తలగశిశువును నే చదనుజుండుగాడు ॥ బలిమినింద్రునిదొలబలిగాడుతలపోయ- నలవేయుహ స్తములయతడుగాడితడు॥ తలలుపదిగలయట్టిదానవేశుడుగాడు - అలయిం చుమడిగాలియతిగాదు తెలియ॥ ...................... *

గీ ॥ వింతవాడాదివేషునివెన్నుదన్ని । పుట్టెజగములెరుంగనీభోగివరు డు । ఇంతకోపమువిూకేలఇతనిమీద । దప్పులున్ననుసైచుముదానవారి॥

జంపె,

అయ్యవిూ మహిమంబు లవుడె తెలిసిననితడు - చయ్యనను మీపాదజల జము లెగొలుచుర॥ ఇయ్యెడలనభయంబులిచ్చిరక్షించితే- వెయ్యిభంగులమి మ్మువినితిజేసెదము ॥ నెయ్యమునమనవిని నెనరుతోగరుణించి- తొయ్యలులు మామాటతోప్రియకుమపూని॥ ........................... *

వ॥అనిమఱి న్నేమనుచున్నారు.

క॥ తలలెల్లనలసిపోయెను। బలపలకన్నీరుదొరుగబడలికచోచెర।బలము డిగిమూర్ఛమునిగెను। జలమేలనుబోప్రవుమికనుసరసిజనాభా॥ ... *

వ॥ అనుచుగాళింగునిభార్యలు తమపైయ్యెదకొంగులొగ్గి భక్తవత్సలుం డయినజనార్ధనునితో నేమనుచున్నారు॥ ... ... ... *

జంపె.

పురుషభిక్షముబెట్టుపురుషోత్తమాయాది - పురుషుండవటుగానబు ణ్యంబునీకుర ॥ పరహింసపాపమనిపలుకుచురుభువిలోన - భరహింసపరు డునీబలుపాపజాతి॥ పరులకును నుపకారపదముమీమదినెంచి పరుడనకయా కాళి బంటుగానేలు॥ ............................*

వ॥ అనిమఱి న్నేమనుచున్నారు.

జంపె- మారమణుప్రాణములుమారమణరక్షించు- మారుపలుకకుము మువమ్మారుకన్నయ్య॥సారసాక్షులుమిమ్ముసారెసారెకువేడ-స్వారస్యరచన

లేచాలమదిననుచును ॥ కోరినీను వేడితిమికోరికలనొనగూర్చు - కూరిమితో
మముబ్రోవుగోపాలయిపుడు॥ ... ... ... ... ... *

అటతాళము.

ప్రేమతోడనుమాకునిచ్చుటబెండ్లి సేయ-నాథుని-నేమముననియమిం
పుమీతనినీరజాక్షి॥పిన్ననాడాడినది పెండ్లేసన్నుతాంగా-యిప్పుడు-చెన్న
గామముబెండ్లి సేయుముచిన్నికృష్ణా॥నీవు జేసినపెండ్లి భద్రమునీరజాక్షు- తల
వగ- గావబ్రోవనుగర్తవీవేకరుణతోడ॥ ... ... ... ... *

గీ॥మమ్ము బెండ్లి సేయుమాప్రాణవల్లభ। ప్రాణమిచ్చి కావుభక్తవర
ద।నీవు జేయు పెండ్లినిత్యంబుభద్రంబు।పిన్ననాటిపెండ్లి పెండ్లి గాదు॥ ...*

వ॥అనియిట్లుపన్నగాంగనలు వేడుకొన్నయాపన్నశరణ్యుండయినజగ
దీశ్వరుండాటలుచాలించి డిగ్గి వారలంజూచితనకరుణామృతరసంబులువార
లపయిజిలుకనేమనుచున్నాడు॥

జంపె.

అంగనామణులార యభయమిచ్చితినిపుడు - పొంగుచుమ గాళింగ
భుజగాధిపతికి॥సంగతిగమీవిభుడుసంతోషముననుండు- భంగమెన్నడులేని
బహుభోగములను॥ అంగజునిజనకుడపుడానతిచ్చినవినియు-మంగళప్రదమను
చుమదిసంతసిలిరి॥ ... ... ... ... ... ... ... ... *

వ॥ అప్పుడాయురగభామినులుహరియానతిచ్చినమధురవాక్యంబులు
తనప్రియునకుండెలిపిననతండునొగిలిన మేనునునలసినతలలునుజక్క- గానల
రించుకొనియితండువిష్ణు దేవుండనితనమనంబుననిశ్చ యించిగోవిందునిచర
ణారవిందంబులకు వందనంబులాచరించిముకుళితకరక మలుండయియేమనివి
నుతింపుచున్నాడు॥ ... ... ... ... ... ... ......*

ద్విపద-

జయజయసర్వేశజయభవనాశ-జయజయలక్ష్మీశజయదయిత్యనాశ-
జయజయసురరక్షజయమానిపక్ష - జయజయరిపుశిక్షజయజగద్రక్ష- కుక్షిని
జగములు కుదురుగానిలిపి - రక్షించగలయట్టిరాజవునీవె - యింద్రియంబు
లయందునిరవుగానుండి - యింద్రియంబులపోకకిష్టంబునీవె - యరుదుగాద
త్వంబులందులనిలిచి - క్షరమక్షరమునకుసంధివినీవె- పిండాండనడుమనబిం
దువయియుండి-యండపిండంబులకధిపతివీవె- నాదబిందునుగళానాణ్యంబు

సీవె- వేదాంతమయుడయినవిభుడవునీవె-పుట్టింపరక్షింపబోడవడగింప- గట్టి గాబ్రహ్మాండకర్తవునీవె - యిన్నిచిత్రంబులు నెరుగనియటుల పన్నినసూత్రం బుబ్రహ్మమలయిన- దెలియంగనేర్తురె దేవదేవేశ-విలసిల్లనీకీర్తివినుతులుసేయ- నేనేరబొగడంగనీరజనాభ- జ్ఞానినిగానునజ్ఞానినినేను - మలయుచునేవేళమదిలోననుంచు - సలలితంబుగభక్త జనములయందు - వదలకవర్తించువయిభవలీల - సదమలాచారంబుసాధింపవశమె - యటుగాననేనెంత యపరాధినిపుడు-కటకటానీమాయగాన లేనయితి - రక్షించురక్షించురాజీవనయన- పక్షివాహననిన్ను బ్రణుతింపగలిగె-దయజూడుమికనయినదాసునినన్ను - భయనివారణముగా బలుకవేనీవు - అనియనిప్రార్థించి యహివల్లభుండు- వినయంబుతోడనువిష్ణుదేవునకు - మ్రొక్కి-నగరుణించి మోధంబుతోడ - జిక్కి-తివాయనిచిరునవ్వునవ్వి - లెమ్మని సెలవిచ్చి లియ్యంబుతోడ-నమ్ముమింకనునీవునావాడవయితి - శుభముహూర్తంబిప్డు శోభనమయిన-నభయమిచ్చితినీకునమరుల వ్రెగడ - మనముననికనీవుమరువకుమమ్ము-ననియు టుశ్రీహరియహిరాజుకనియె॥ ... ... ... ... ... ... *

జంపె.

ఉరగవల్లభయికను నోడకుముభయమేల - సరగమెచ్చితినీవు సన్నుతులుసేయఁగ॥తిరుగుమెచ్చట నేనదిగులెల్లదిగనాడి - యరుగుమిచ్చటు బాసియవ్వలికినీవు ॥ పరగలెల్లప్పుడుభక్తి తోమముగొల్చి - మరిగిసుజ్ఞానివయిమనుమికనునీవు॥ ... ... ... ... ... ... ... *

వ॥అనియానతిచ్చినవాక్యంబులకుసంతసించికాళింగుడేమనుచున్నాడు॥

జంపె.

ఓదేవమీయాజ్ఞనుల్లంబు రంజిల్ల - నామువిన్నప మొకటి నలినాక్షువినుము ॥ వామచేగరుడుండువయిరమెమదినుంచి- భేధించిమదిచాలభీతినొందించు ॥ చేదోడుగామడువు జేరియుంటినినిపుడు- నీదయామృతదృష్టి నిండెనాపయిని॥ ... ... ... ... ... ... ... ... *

వ॥అనినవినికృష్ణుండేమనుచున్నాడు,

జంపె,

మాపాదములునీదుమస్తకంబుననిలిచె- నాపక్షిరాజునిన్నలయించడికను॥పాపజాతులకెల్ల బగవాడునీపట్ల-గోపముంచక చెలిమిగూర్పగలవాడు॥ చేపట్టెనికమీద జింతలెల్లనుమాని - ప్రాపుదాపుగజాలప్రబలుదువుపామ్ము॥

వ ॥ అనియిట్లుసర్వేశ్వరుండానతిచ్చిన సంతోషచిత్తుండయి యు
ప్పొంగి కాళింగుడనేక దివ్యరత్నభూషణంబులు కృష్ణదేవునకు కానుకలుస
మర్పించి భార్యలుతానును ననేకప్రకారంబుల వినుతులుచేసి హరియనుమ
తంబున రమ్యస్థలంబునకుంజనిరంత నచ్చటగోపాలుండు దయాచలంబున
పొడచూపుబాలభాస్కరునిపగిదిమడువు వెడలివచ్చునప్పుడెడువలెనుండెను-

ద్విపద.

అప్పుడుకృష్ణుడాహ్రదమునువదలి - కప్పినమేఘంబుకడద్రోచియి
నుడు - పొడచూపునటువలెభూనభోంతరము - కడువడిదేజంబుగ్రమ్మినయ
టుల - దివ్యభూషణములు తేజమయినట్టి - దివ్యాంబరంబులు తెరగొప్పదా
ల్చి- వచ్చెడిశౌరినివల్లవులెల్ల- జెచ్చెరబొడగనిచెలువంబుమెరయ - నందు
డాచూడనీనందనురాక- మందయానముతోడమడువునువిడిచి- యనిపల్క
నంతలోపోసుతాయనుచు- వనమునునుప్పొంగిమాధవుజూచి - గ్రుచ్చికౌగి
టచేర్చికొమరుడాయనుచు వచ్చితేనామదివాంఛలుదీర- ననుడాగురించ
నున్యాయమేనీకు- నినునమ్మియుంటినినీవారివిడచి - యడవులనీరీతినలసటలే
క- తడవువసింపగతగవెనీకనుచు- నానందబాష్పములందందగురియ - నా
నందమునుబొందెనానందుడంత- తరుణియశోదయుదగమూర్ఛదెలిసి- పరి
పరివిధములబలువరింపుచును- దనయునిజూచెడుతాపంబుచేత - బెనగొన్న
మమతతోబిసరుహనయన- యడుగులుతడబడనసియాడనడుము - గడగడ
వడకుచుగడుదీనయగుచు - జయ్యనమడివీడి జాలగాగొప్ప - పయ్యెదజా
రంగబలువులయినట్టి- వాటంపుచనుగవవరుసతోనోరయ- హాటకోజ్వలమే
నహారముల్ మెరయ - ముంగురులసియాడమోము సెమర్ప - రంగయినక
న్నులురాణించుదీప్తి- చెక్కుటద్దములందు జెలువంబుజూప - వెక్కసంబగు
ప్రేమవెలికినిరాగ- ఖేదమంతయురోసికినుకతోనపుడు- మోదంబుతోసుతు
మోమువీక్షించి - బారలుజాపుచుబాళిమీరంగ - గారవంబునహరిగౌగిట
జేర్చి- నాయన్నవచ్చితేనాజగజట్టి- నాయయ్యనినుగంటినాముద్దుపట్టి - క
న్నులగప్పినకరువెల్లదీరె- వెన్నుడునాతోడవేరుమాట్లాడు- మలిగియున్నా
వేమొయబ్జాక్షుయనుచు - విలసిల్లప్రేమలు వేడ్కలుప్పొంగ - ముద్దియకర
ములుమోమునసొత్తి- ముద్దియపయిబులకమొలకలేర్పడగ- జెలియకుజను
బాలుచేసెపైనావేశ- నలబిడ్డపైవాంఛలతిశయిల్లంగ - గొనగోళ్లమెల్లనె

కూకటిమువ్వ - మనసురంజిల తేటమాటలాడుచును - బెన్నిధిగన్నట్టిపేద చందాన - గన్నపుత్రుని గాంచికలికియిట్లనె॥ ... ... *

జంపె.

ఒంటిగామము బాసియుందు రేయిందాక - జంటబాయని గొల్లజంటలనువిడిచి ॥ కంటకముతో బాము వెంటనంటెనో లేక - బంటుతనమున నెదిరి భంగపడెనేమొ ॥ కంటవినగలవాని గెట్టించివచ్చితో - తుంటయనుచును బాముదోవనంపితివో॥ ... ... ... ... *

వ ॥ అనినతల్లిదండ్రికి గోపగోపికాజనంబులకు నుల్లంబురంజిల్లపం చగారలొలుకు పలుకులుబలికినవారలు సంతసిలి గృష్ణుని బొగడుచున్నంత బలరామ సమేతుండయిపశువుల తరలించికొని వచ్చునప్పుడు నస్తమయం బయిన యారాత్రియందు వసియింపశ్రీసమయంబున కార్చిచ్చువచ్చిచుట్టుకొన్నగొల్లలు భయపడికృష్ణునితో నేమనుచున్నారు.

గీ॥ చిచ్చుచుట్టుకొనెనుశీఘ్రిమెచల్లార్పు । కరుణయుంచుమిపుడుకమలనాభ । యనుచు వేడుకొన్నహరిదయాదృష్టిచే । మంటనెడిసిమ్రింగి మందగాచె॥ ... ... ... ... ...*

వ ॥ అంతదెల్లవారిన మందగదల్చికొనివచ్చి సుఖంబుండి కొన్నిదినంబులకు నింద్రయాగంబు సమకట్టినందుండు యత్నంబుచేయు నప్పుడు తండ్రితోముద్దుల బిడ్డండేమనుచున్నాడు॥ ... ... *

గీ॥ మఖము సేయునీవుమదినుత్సహించెదు। దేవుడెవడునీకుదెలియబలుకు । మనినబిడ్డజూచియప్పుడిట్లనినెతండ్రి। వాసవుండుకర్తవనజనాభ॥

వ॥ అనినగోపించి హరియేమనుచున్నాడు.

జంపె.

సకలంబునకుసాక్షిసర్వేశ్వరుడుగాక - వికటమాయిామాటవినగూడదయ్య ॥ దేవేంద్రుడెవ్వడో తెలిసిచూడుమునీవు - దేవదేవుడుజగతి దేజరిల్లగను॥ ఈశుడొక్కడుగాకనితరులెవ్వరులేరు - భాసిల్లుసిరులొసగుపరమేశ్వరుండు ॥ ఈశ్వరునిపూజించియిపుడుయాగము చేయ- శాశ్వతంబుగసుఖముసమకూడునెపుడు॥

వ॥ అనుచుముద్దులుగులుకు బిడ్డనిసుద్దులకు తండ్రిసంతసించి యీ

శ్వరునింబూజించి యాగంబుసేయ సకలబంధులసమేతంబుగా మఖమహోత్సవంబుసేయించిన సహింపక యింద్రుండు కోపించి మేఘంబుల రావించియేమనుచున్నాడు,

అటతాళము.

గొల్లలెల్లనునన్ను మెచ్చకకొ౹వ్వినారు- వారలు- తల్లడింపగవానగురియుడితడవునిలిచి - అనినమేఘములన్నిగూడుకనమితముగను - యప్పుడు- ఘనముగాజడిగురిసెగొల్లలుగాసిజెందర- అపుడువడకుచునందుడాదిగయఖిలజనులు- హాహాయని - కపటశౌరిని మొరలువెట్టిరికావుమనుచు॥

వ॥అప్పుడేమనుచున్నారు,

క॥ఆయురుములునీ మెరుములు । నీయశనీపాతకములునీజలధారల్ ।
నీయానతొల్లి మొఱుగము। కుయ్యాలింపంగదయ్యగుణరత్ననిధీ॥

వ॥ అనినవినికృష్ణుండు వారలనుబశువులనుగరుణించెదనని పూనెనటయెటువలెను॥

జంపె.

గోవర్ధనాద్రితన గొనవ్రేలధరియించి - గోవిందుడపుడెత్తెగొడుగువలెదానిని ॥ రారెతలితండ్రులారారెవల్లవులార - రారెపశువులుమీరురాజసంబుగను ॥ అనుచుబిలిచినవారలామందలునుదాము - అనువుగాగిరిక్రిందికరిగిరాక్షణమె ॥ వల్లవులుపశువులునునుల్లములురంజిల్ల - అల్లయింద్రునిమనసుతల్లడంబందర ॥ వెల్లనయిజంభారివెరగుపడితనుగుండె-ఝల్లుమనమేఘములసమతిరావించెర॥ ... ... ... ... *

వ॥ అంతటవర్షంబు వెలిసినహరితనవ్రేలమెత్తినగిరియథాస్థానంబుననునిచిన సురులువిరులుగురియనందాదియాదవులు వినుతించుచుండనింద్రుండు శిగ్గును భయంబును మనంబునంబెనుగొనవచ్చి గోవిందునకు దండప్రణామంబు లాచరించిననతనిమన్నించి సురలోకంబునకుంబనిచి తాను నెప్పటిచందంబున నావులగాచుచున్నకృష్ణునిరూపురేఖావిలాసంబులుచూచిగోపకన్యలుతమలోదామేమనుచున్నారు॥

జంపె.

చెలియయీప్రియునితో జెలిమిసేయకయున్న - కలుగునెభోగంబుకాంతలకునిపుడు ॥ కలికియీరమణుతోగదిసిముచ్చటలాడ- గలుగకుండి

నచెలికిగలదె చెలువంబు ॥ కలకంఠియూప్రియునిగలయుచుండినసతికి।గలలో
ననయుననుగలుగు నేసుఖము॥ ... ... ... ... *

వ॥ అనియిటువలె గోపగబ్బిగుబ్బ తలుమదనాతురులై కృష్ణదేవు
నిమగని గావడయునుపాయంబు చేసిరటయెటువలెను॥

ద్విపద,

గోపికలొకనాడుగోర్కెలుప్పొంగి - శ్రీపతివిభునిగాచిత్తంబులం
దు - తలచిదుర్గికిమొక్కితెగవ్రతంబొకటి - సలుప గయమునకుజని
గోపికలును - నిసుమున గౌరినినింపుగానునిచి - మసలక పూజించి మగు
వలందరును - దనుకోర్కెలన్నియు దగవిన్నవించి - క్రమమునకాళినిగడు
వేడ్కగొలువ - దినదినం బటువలె శెరవలందురును - వనజాక్షిగౌరికివ్ర
తములుసలుపు - చున్నంతనొకనాడునుల్లసంబునను - గన్నియలందరుక
డుసంభ్రమమున - వరమాఘ మాసంబు వచ్చె నటంచు - సరసిజ ము
ఖులిదిసమయమటంచు - ప్రొద్దున మేల్కాంచి పూజలుసేయ - ముద్దుల
శౌరిపై మోహముప్పొంగ - భావంబులో నిల్పి పడతులవ్వేళ - బోవుబో
జెలరేగిపురవీధులందు - నాటలపాటలహరినిగీర్తించి - పాటలగంధులు పరి
పరివగల - గబ్బిగుబ్బెతలపుడు గానంబుచెలగ - గొబ్బిళ్లు జరచిరికులుకు
చునపుడు॥ ... ... ... ... ... ... ... *

గొబ్బిపాట.

కొమ్మలారరారేముద్దుగుమ్మరారరారే॥ గొబ్బియళ్లో ॥ ఇంతులా
రరారేమరునిబంతులారరారే॥ గొ॥ అతివెలారరారేపసినిప్రతిమలారరా
గొ॥ జాణలారరారేజిగురు బోణులారరారే ॥ గొ ॥ ఆశలెల్లదీరమీరి కే
శవునిబాడరే॥ గొ॥ గబ్బివయసుచెలులుమీరుగొబ్బిళ్లాడరారే॥ గొ॥ వెన్న
నికథలనుమీరు విన్నగానిపాడరే ॥ గొ ॥ తళుకుబెళుకుచూపినీటనళుకులేక
యాదరే॥ గొ॥ పంటవెలదినంటిమొన పంటనెత్తినాడరే ॥ గొ॥ కంభమున
వెడలివేగ డింభకునిబ్రోచినాడే॥ గొ॥ వడుగువలెనువచ్చిబలినియడుగులడి
గినాడే॥ గొ॥ గొడ్డలెత్తికొనిరాచబిడ్డలనుగదిమెనే ॥ గొ ॥ ధచ్చిదుగతలల
వానిగుచ్చిహెచ్చిచంపెనే ॥ గొ॥ బాలలీలవిషముచమలపాలుద్రావెనమ్మా
గొ॥ మక్కువతొబళులగాచిరకసినిజెరచెనే॥ గొబ్బియళ్లో॥ ... *

వ॥ అనియిటువలెగొబ్బిళ్లాడుచు యమునానదికింబోయిఁ యినుమునగౌరీదేవిని షోడశోపచారంబులంబూజలుచేసితమకుగృష్ణుండుమ గడుగావరంబు లిమ్మని ప్రార్థించియచ్చటి యిసుక దిన్నియలయందుబుట్టంబులువిడిచియునిచిజలక్రీడలాడిరటయెటువలెను.

ఏకతాళము.

జలకములాడుచుజలరుహవదనలు- జలములుచల్లుచుజలములతోను॥ బిసరుహనయనలు బిరబిరనీదుచు-మసలుచునచ్చటిదెసలకుఁజనుచుఁ ॥ తమ్మిమొగ్గలవితగునాచనులకు - నెమ్మెలవికసితహాహాహాహాయనుచుఁ॥ తొగలీకన్నులతోసరియవునా - పగలుమూతలనిపకేపకనగుచుఁ ॥ కులుకుచుబెళుకుచు చిలుకలకొలుకులు- కలకలనవ్వుచుకలరవమెసగఁగ,

వ॥ ఇటువలెనాటలాడుచున్నవల్లవపల్లవపాణులపోకలెరింగివారల వస్త్రంబులపహరించివచ్చెదననుచుగృష్ణుండువచ్చెనటయెటువలెను,

అటతాళము.

కదలకుండగదోగివారల కదిమికదిమి - తానటుపొదలమాటులచేరి మెల్లనెపొంచిపొంచి ॥ అదనుచూచటుగోపగాంతల యంబరములు - దొంగిలి-సదయుడై మానెక్కె-వేగమెముదముతోడ ॥ అదరుబెదురును లేకవ్రేతలుఅతనిజూచి - మోహము - మొదలనీయకచూచుచుండిరిమెలతలెల్లఁ॥

వ॥ అంతవల్లవకాంతలుసిగ్గును మోహంబుమల్లడిగొనివల్లవకాంతుని తోనేమనుచున్నారు.

జంపె.

మామమామానీవుమామామవవుదవు - మామానములుగొనుచుమమునేచనగునె ॥ మానుమానుమటంచుమానపతులనగానె - మానకిటువలెనీవుమానెక్కఁదగునె ॥ కోకకుచలిందుండకోకలెత్తుకనీవు మాకులమువాడవైమాకులెక్కఁదగునె,.................................... *

వ॥మఱినేమనుచున్నారు.

ఏకతాళము.

కోకలెత్తుకొనిశాకలువ్రేయుచు - మాకులెక్కినదిలోకలునగరె ॥ అబ్బురపాటునగొబ్బునవచ్చితి - వుబ్బుచునిలువకయురికితివేమొ॥ కొమ్మలనందరుకమ్మికయుండగ- యెమ్మెలుచూపను నెవ్వడువీవు॥ దొరతనమిచ్చట నెర

తనవశానా - తరుణుల నేచగదగు నే చెప్పుమ ॥ వలవనిరచ్చకు వచ్చద వే మో-వలదువలదుమా వలువలు దే వే॥ ... ... ... ... ... ... *

జంపె,

రాజముఖులిందుండరంజిల్లనిచ్చటికి- రాజసంబునరాగరాజ వేసీవు॥ వలపుగలిగినమాతో వచ్చిమాటాడవలె - వలపు తెలిసినయట్టివాడ వే చెప్పుమ ॥ ఏమియెరుగనిసతుల నే చేదిమర్యాదె - యేమిటికిమా పటము లె_త్తితివి చెప్పుమ ॥ దూరమని యుండి మీవారమని మ్రొక్కితిమి- గారవముతో మమ్ముగరుణించరాదే ॥ నేరమనియున్నాము నేతుఁ-మన్నియునిన్ను - నేరము రిపించుటకు నేరమా మేము, ... ... ... ... ... ... *

వ॥మఱి న్నేమనుచున్నారు,

ఏకతాళము.

రట్టు లేలనీరమణులమంటిమి- గుట్టులు చెరచక కోకలనీ వె॥ దేవుడవనుచును భావము దెలు సెను - నీవును బిలిచిన తాపుకు రామా ॥ ఎవ్వ రైననీ రవ్వలువిన్నను - నవ్వ రెమమ్మునవలువురిలోనఁ ॥ ఆశలునీ పైనతిశయమాయెను - దాసులమమ్మిక దయతో నేలు.

వ॥అనియిట్లు వేడికొను చెలులంజూచికృష్ణుం డేమనుచున్నాడు-

గీ॥చీ రెలిత్తుమీకు చెలులారయిచటికి। వెడలిరండుమీరు వేడ్క-తోడ॥ నిపుడువలువలిత్తునిక్క జాగువలదని।రమ్మటనుచు బిలువరమణులపుడు॥

జంపె.

చీ రెలిచ్చెదననుచుజీ రెదవుపలుమారు - జీరలియకయటకు జేరంగవశమే॥ అలయించవలదుమాయంబరంబులనొసగి - మరు కేళినలముకొనిమరిచూడుమమ్ము ॥ మనసు దెలియకనీవ్వుమరిమమ్ము నే చెదవు - మనసునీవిచ్చినను నెనసియుండెదము-

వ॥ అనినవినివారలకువస్త్రంబులొసంగరమ్మనినవెడలిలజ్జించివచ్చిరటయెటువలెను-

అటతాళము,

వెడలుదమురమ్మనుచుబిలుచుచు వెడలియెుకతె - పిలిచిన-వెడలరాదనిసిగ్గుతోడనుబిలుచు నెుకతె ॥ ఏటిసిగ్గనిపోవదలచును నింతియెుకతెపో

వుటమాటగాదని తెలియఁజెప్పనుమగువనొకతె ॥ తరలుకమయిపుడనుచు
జీరునుదరుణియొకతె- చీరిన - నయసిగ్గెక్కడిదెయనుచునుసరుగనొకతె॥

వ ॥ యిట్లుడోలాయమానమానసంబుననున్న కన్నియలంజూచి శౌ
రి యేమనుచున్నాఁడు॥

గీ॥ నీటిలోనఁనుండినీటులుచూపిన। బటములొసఁగమీకుబడతులార। వె
డలివచ్చి (మ్రొ)క్కి- వేడియుమాచీరె।లిచ్చుటంచునడుగనిత్తు నేను॥ ... ... *

వ॥ అనినవిని వల్లవకాంతలయుల్లంబురంజిల్లంబలికినవిని వెడలివచ్చిత
రువుచెంతనిలిచిన వెన్నుం డేమనుచున్నాఁడు॥

జంపె.

మగువలారాయిటకుదెగువతోడనువచ్చి- తెగువచేసుకయుండదగవ
వునేమీకు ॥ నగవుగాదీమాట వగవకుడుచెప్పెదను - మగవారు లేరిపుడు
పగవాడగాను ॥ మొగమాటమికమాని (మ్రొ)క్కి-మీరందరును - వగగుల్క
నడిగితేవలువలిచ్చెదను॥ ... ... ... ... ... ... ... ... *

వ ॥ అప్పుడా చెలులొడంబడి (మ్రొ)క్కి-రటయెటువలెను॥

క॥ ఒకచేతమరునిగ్రహములు। పికవాణులుమూసికొనుచుపిత్తరివ
గలర। నొకచేతహరికి మ్రొక్కి-న।బకపకనవ్వుచునుశౌరిభామలకనియెఁ॥

ఏకతాళము.

తొగతీగెతూపులదొరయంక్ష్లనిటువలె-సొగసుగమాటెసచోద్యంబాయెఁ॥
అయితేమంచిదియంగనలెల్లను - బయినములయితిరిపటములనడుగఁ ॥ రెం
డుచేతులను దండిగమ్రొక్కి-న - నిండుమ్రొక్కు-లనినిలువరమానా॥ మ్రొ
క్కి-యడిగితే(గ్రక్కు-నబటములు-నిక్క-మ్మొసగెదనెలతలకెల్లఁ॥ ... ... *

వ॥ అనిపలికినమాధవుపలుకులకుమనోల్లాసంబునకు దమకంబు రె
ట్టింపరెండుచేతుల (మ్రొ)క్కి-రటయెటువలెను॥ ... ... ... ... ... *

జంపె.

మదనసదనములెపుడు పదనురకవలవుంచె - మదన గురునకు మ్రొ
క్కి-సదయులయిరపుడు॥ పరవశంబుననుసంభ్రముమలేనిచిత్తముల-పరమానం

లా నెమరపర మేమి నెమరక॥ నిలిచినయున్నను జూచినీరజాక్షుండపుడు - పి
నిచివారలతోడ బ్రియముతోనియెఁ ॥ చెలులార మీకోర్కె-సిద్ధించె గాలి
చే- వలువలిచ్చెదమిూకువగ పేలనికను॥ ... ... ... ... ... *

వ ॥ అనిమరి న్నేమనుచునాడు.

ఏ క తా ళ ము.

సిగ్గువిడుపుడికచీరెలిచ్చెదను - దగ్గిరవచ్చినదప్పేమికను ॥ దవ్వుల
నుండెడుతరుణులరమ్మని - చువ్వటంబులాధూర్తులకిచ్చెఁ ॥ చీరెలుగట్టుక
చిరునవ్వులహరి- జేరుచుమంద సజేరిరియిపుడుఁ॥ ... ... ... ...*

ద్వి ప ద.

అంతనా శ్రీకృష్ణుడా మ్రానుడిగ్గి - సంతసంబున వచ్చి సఖులతో
గూడి - మొదవుల మేపుచు మోహ నాంగుండు - ముదితలుతనమీదిమో
హంబుతోడ - నున్నచందముచూచి యొక రేయినతడు - పున్నమవెన్నెల
భువినిండియుండ - వనమునకేగియు వనజనాభుండు - మనమున నుప్పొం
గిమధురగానముల - వేణువు పూరించ వెలమలందరును - జాణుడువనభూ
మిసరసనున్నాడు- అనుచుబయికములయినయ త్తమామలును - బెనగొన్న
నుగలతోబిడ్డలాదిగను-నరికట్టినిలుచున్ననందరింగడచి - సనిలేని మోహంబు
సాధింపుచుండ - నెవ్వరి నెంచరో యేలకాముకులు - రవ్వకు వెరతురే రమ
ణులా వేళ - కాంతలమాయలు గడవగావశమె - యెంత జెప్పినగాని యెల
నాగలపుడు - కమలాక్షుపయి మోహకాంక్షలుప్పొంగ - దమకంబునిలు
పక తహతహపడుచు - హరిజేరి విరహములతిశయింపంగ - సరసిజ వదను
డు సంభ్రమంబుగను - జెలులనందరిజూచి చిరునవ్వునవ్వి - పలికెనప్పుడు
వారి. భావముల్ దెలియ॥............... ............... *

జం పె.

చెలులారమీరిపుడుసిగ్గెల్లనటుపెట్టి - వలపుగలిగిననిటకువచ్చుటలుత
గున ॥ తల్లితండ్రులవిడిచివల్లభులదిగనాడి - యెల్లబంధులువవ్వ జెల్లునా టె
మీకు॥ పతి ప్రాణ పదమయిన బంధుండుతలపోయ - బతినిబాసిన సతులమ
తు లెల్ల వెతలు॥. ... ... ... ... ... ... ... *

* వ॥ అనికృష్ణుండుపలికినవినివల్లవకాంత లేమనుచున్నారు.

జంపె.

పతివైననీవెమాపాలిదైవమునీవె- పతులేలమతులేలబంధుజనులేల॥
గతినీవెయనుచునాకాత్యాయనీదేవి - పతిగాగనినుజూపెఫలముసిద్ధించె॥
ఇతలబెట్టకుమమ్ము వేగమేరతికేళి-నతులితంబుగగలయుమరమరలులేక॥ *

వ॥ అనిపలికిన వినికంతు జనకుండువింతలు గులుకమరుకేళిగోపకాం
తలకందరికన్నిరూపంబులయి వెన్నెలబయిట పూబొదరిండ్ల సైకతస్థలంబుల
నచ్చటచ్చటరమ్యప్రదేశంబులవారివారి మనోభావంబులెరింగిరమియిం
చెనటయెటువలెను॥

ఏకతాళము.

చిత్తినిచెలులనుజిత్తజుకేళిని- హత్తుకతమకంబలయగసలిపె॥ హ
స్తినిమగువలనలుకకబెనగిన - కస్తరించిరతికూడెనువేడ్క॥ శంకినిసతు
లనుశంకలుదెలుసుక - పొంకమిసురతతిపొందుగసలిపె - పద్మనిజాతులప
ద్ధతులరసియు - బద్మగంధులనిపదరకకలిసె॥ ... ... ... *

వ॥ అంతకృష్ణుండుసురతోపభోగంబులదృప్తులు బొందినవల్లవసుం
దరాంగులనువారివారిమందిరంబులకనిచి - తానుయథాక్రమంబుననున్నం
తనొక్కనాడు కంసుండుకుటిలబుద్ధిదలంచియాగంబుసయసమకట్టియచ్చ
టికిబలరామకృష్ణులరావించి తనపగదీర్చనుపాయంబుచూచి తానుజేసిన
యత్నంబులకుగృష్ణుండగుపడకతప్పించికొన్నవిధంబులకు వెరచియక్రూరు
నిరావించియతనితోనేమనుచున్నాడు.

జంపె.

ఓక్రూరములునీవు నెంచకుముమదిలోన- నక్రూరవినుమనుచునాక్రూ
రుడనియె॥ మఖముసేయగమేముమదినుత్సహించితిమి - మఖముచూచుట
కిటకుమాధవునిదెమ్ము॥ కనరుమాటలకెల్లకల్లలనిసాధించి - నెనరుబుట్టగబ
ల్కనీనేర్పుచేతను॥ ... ... ... ... ... ... *

వ॥ అనియక్రూరునొడంబరచియనిచిననతండు రథంబెక్కియతిత్వరి
తగమనంబున మందకుంజని బలభద్రసహితుండైయున్న హరినింజూచి దం

డ్వ్రణామంబులాచరించి వెదవచనంబుల దృప్తులంజేసినభక్తవత్సలుండయిన భగవంతుండక్రూరభక్తికి మెచ్చియతనింగూర్చుండ నియమించికుశలంబడిగి హరియేమనుచున్నాడు,

అటతాళము.

తల్లిదండ్రులునుగ్రసేనుడుదలతురేమో - మమ్మున-నెల్లకాలమునీ వుబంధులు నెంతురేమో ॥ మానుమాపైదయలునిప్పుడుమరచినాడోయూరకె - తామసుండైకుటిలబుద్ధులుదలచెనేమో ॥ ఎన్నడిచటికిరానివారణుతిన్నగాను-వచ్చితి-రెన్నడిచ్చటిపనులవేమోయెరుగజెపుము. ... ... *

వ॥ అనినవినియక్రూరుండుహరితోనేకునుచున్నాడు.

జంపె.

మిముదలచుపౌరులకుమేలైనశుభములే - క్రమముతోడనుగలుకడు వేడ్కతోడ ॥ నీవుదిక్కనిమదిని నిరతంబుదలపోయు - భావజ్ఞులకు నెపుడు పరిణామమునురు ॥ వేదాద్రిగుహాలలో విహరించువిన్నాణి - యాదవుల యిండ్లలో నేలయుండెదవు ॥ భక్తవరులకునెల్ల బహుదయారసముచే- భుక్తిముక్తియునొసగు పుణ్యుడవునీవు ॥ కావుననుమీకరుణ గలిగినప్పుడెమాకు- శ్రీవెలయుసుఖములును జేకూరునయ్యా. ... ... ... ... ...*

వ॥ అనినవినికృష్ణుండతని భక్తికిమెచ్చినీవువచ్చినపనులు చెచ్చెరవాక్రుచ్చుమనియానతిచ్చినహరితోనక్రూరుండేమనుచున్నాడు.

క॥ మీమామముఖము చేయుచు। బ్రేమంబుననటకు మిమ్ముబిలువగబనిచెన్। దామసమువలదుతరలుము। రామునితోగూడినీవు రాజీవాక్షా॥ ...*

జంపె.

మామామతామఖముమముజూడరమ్మనగ - మామనసురంజిల్లెమామతము వెలసెన్ ॥ కనికరంబును లేక నెనరుతోబంపగా - దనరుబుద్ధిదియుగాదనుమునికర్గముగా ॥ ఈవర్తకునిచ్చటను దేవరకు బ్రమొక్కెదము - భూవరునకుదయలుపుట్టవలెనను చున్॥ ... ... ... ... ... *

వ॥ అనియిటువలెముచ్చటలాడుచునక్రూరునినాదరించి నందయశో

దాములును గోపగోపికాజనంబులు పరమోల్లాసంబున వారలగారవించిమ
రియును మృదుమధురవాక్యంబులనందరి యుల్లంబులురంజిల్ల నెడంబరచి
తగినవారి తమవెంటరానియమించియన్నయుదానునురథారూఢులయి య
క్రూరుని వెంబడిచనిచని ముందరమధురాపురింగాంచి యచ్చటనిలిచి కం
సునకుతమరాక యెరిగింపుమనుచనక్రూరుని ముందుగాననిచిన నతండతిత్వ
రితగతింజని కంసునితోయదుశేఖరులరాక యెరుగించి యక్రూరుండు తన
మందిరంబునకుంజనెనంత రామకృష్ణులుయాదవులు తమ్ముగొలువమధురా
పురంబుప్రవేశించి రాజమార్గంబునవచ్చునప్పుడు నారాంగనలువారల రూ
పురేఖావిలాసంబులుచూచి మేడలమీదనుండి యేమనుచున్నారు,

సీ ॥ వీడటేభూతకివిషముచన్నులబాలు బాలితో(ద్రా)వినబాలకుం
డు । వీడటేబలుబండివిఱ్ఱువీగుచుగాలచురుసుగాదన్నినమండగిడు । వీడటే
సుడిగాలివిధమెల్ల నెరిగితా బట్టుక మెడనుల్మిపారవైచె । వీడటేకోనఱ్ఱేల
వేగమెగిరిమెత్తి గొడుగుగాబట్టినగురుబలుండు । వీడటేమున్నుకాళింగు
వెడలనడచె। వీడెదొంగిలియింటింటవెన్నమెసవె । వీడెకార్చిచ్చుకబళించి
వేగమ్రింగె । వీనిమాహాత్మ్యమెన్నంగవింతలమ్మ॥ ... ... *

వ॥ అనిమరి న్నేమనుచున్నారు.

సీ॥ ఇతడటేనీటిలోనీదుచుబెళుకుచు జమువులుదెచ్చినసాహసుండు
ఇతడటేతరిగొండనెత్తివీపునవాని బువ్వంబుబెట్టినపుణ్యమూర్తి । ఇతడటే
కొమ్మునననిలయెత్తిరక్కసు దునిమికేకలువెట్టుచుండగీడు। వీడటేకంబానవె
డలిననరహరి వీడటేవామనవేషమూనె। గబ్బిరాజులజెలరేగియుబ్బులడచె
నంపకోలనుమున్నీరునడచినాడు । ఇతడుక్రేతలకెల్లనునింటిమగడు। ఇతడు
బుద్ధులకలికనియెంచదగునె॥ ... ... ... ... ... ... ... *

వ॥ అనికృష్ణునిమర్మంబులెంచి బలభద్రునిజూచియేమనుచున్నారు-

సీ॥ కాంతరోయీతడా కాళిందిగర్వంబు వాగేటమ్మినవాయకుండు।
హాలతిరోయీతడాప్రూనిప్రలంబుని భగ్నంబుచేసినబాహుబలుడు। చెలియ
ర్రోయీతడాచెడుగురాకాసులబోనీకచంపినభూరియశుడు। మగువరోయీ
తడామందనావులనెల్ల మెరసికృష్ణునిగూడిమేపినాడు। భామయీతడునం

దుని ప్రాణపదము। కొమ్మయీతడురోహిణికొడుకుసుమ్మి । బలుడుబలుడ
నియీతనిబ్రస్తుతింపు బలుడుగాకున్న నెంతు రేబలుడటంచు॥ ... ... *

వ ॥ అనికొనియాడుచున్న పురస్త్రీలంజూచిహరితన కరుణారసం
బులుచిలుక కనుసన్నలవారిగారవించిచనుచున్న నొక్కరజకుండు చలువ
లుగొనుచు నగరికేగెడువానింజూచి యావలువలుతమకు నిమ్మన్నవాడేమ
నుచున్నాడు-

క॥ మీరీవస్త్రములడిగిన । ధారుణిపతిచేతమీకుదండనవచ్చుక్ ।
దూరంబరుగుండిప్పుడు। నెరమునావల్ల లేదునిక్కముసుమ్మీ॥ ... ...*

ద్విపద

అనినయాచాకిపైనతికోపమునను - వనజాక్షుడప్పుడువానినిజంపి -
చాకి తెచ్చినమూట చలువలుగట్టి - జోకతోగృష్ణుడు సొంపుదీపింప - నన్న
యుదాను నఖిలయాదవులు - సున్నతాంబరముల నొప్పిర వ్వేళ - గుసు
మదామంబులు గొంపోవువాని - విసువకరప్పించి విరులు దెమ్మనిన - వా
డంతహర్షించి వాసుదేవునకు - బోడిమిగానిచ్చె బూలదండలును - ని
చ్చినవైకొనియిచ్చలోమెచ్చి - చెచ్చెరవరమిచ్చె జెలువంబునెరయ వా
నివీడ్కొనిపోవ వాడలోనెక తె - పూనిగంధంబులు భూనాథుకడకు-గొం
పోవుచున్నయామచ్చనుజూచి - యింపునశ్రీకృష్ణుడిల్లనిపలికె - బరిమెళద్రవ్య
ముల్ పడతి మాకిమ్ము - సరగనీకగుపంచిసౌందర్యగరిమ - అనినవాయువలి
యునౌగాకయనుచు- మనమునసుప్పొంగిమగువయిచ్చెగను - నందుకి మెయి
నిండనలదివేడుకను - మంగరోద్ధారుడు మానినిబిలిచి - పదపద్మములదానిప
దములుద్రొక్కి - సుదతిచేతులువట్టిసూటిగానెంత- మగువడొంకులుదీరిమ
దంచంతివ లెను - వగలాడినవ్వుచువగలురెట్టింప - మదనసన్నిభరూపమాగీ
మునకును - సదయుడైయేతెమ్ముజాగేలయనుచు - కొంగుబట్టుకలిరుచుకో
మలిజూచి- సంగలితోడను సరసమాడుచును - నన్నమోమటుచూచి హరి
నవ్వుకొనుచు- సన్నుతాంగిరొకింసుసదనంబుజూచి- వచ్చినీమదినున్నవాం
ఛలుదీర్చి- విచ్చలవిడిమేమువిహరింతుమనిన-నింతితానుప్పొంగియింటికిజనిన-
నంత వారంకలునచ్చటనపుడు- మదజగి మొక్కటిమాధవుగదిసి- పొడలుచు

నీలాద్రిపోలెదీపింప - నెదిరినగజముపయి నేపలించి-పదరకకృష్ణుండుబలియు
డయి దాని - దంతంబు పెకలించితలమీఁదనడచె - దంతి నెత్తురుగ్రక్క-ధరమీఁ
దవ్రాలె - హస్తిచావటుచూచిహరియునుబలుఁడు - ముష్టిదులయి రాగముం
దరనపుడు - జమునిచందంబునజాణూరుఁడంత - నమితసాహసమొప్పహరి
జూచిపలికె - గోపాలనీమాయకుటిలంబులెల్ల - నాపాలబడినీకునగుబాటు
లాయె-గొల్లలుమెచ్చగగునియుటకాదు-మల్లులరచ్చలుమాధవవినుము భూ
తకిచనుబాలుపుక్క-టబెట్టు - నీతిగాదిదికంసునిలయంబుగాని - బండిగాలను
దన్నప్రజ్ఞయుగాదు - మెండుగాదేవతల్ మెలగెడుత్రావు-సుడిగాలిమె
డనుల్మజూచుటగాదు- జడియకవచ్చితిచచ్చుటకొరకు- మీరిపాముసుబట్టిమీ
టుటగాదు- భూరిసాహసులున్నపూనికెగాని - యన[illegible]బంతములాడిహరి
జేరవచ్చి - మునుకొనివాడంతమురియుచునడచె - గోపంబుతో జేరిగోపాలు
డపుడు - పాపపుచాణూరుబడద్రోసెజంపె- బలుడప్డుముష్టికుబట్టివిడల్చి- బ
లుముష్టిచేఁగొవ్వుపగలగ్రుద్దినను- నెత్తురుగ్రక్కుచు నేలపయినొరిగి - య
త్తరివాడేగెనంతకపురికి - నప్పుడాకంసుతోనన్నియుదెలుప - నిప్పులరాల్చు
చునిగుడుకోపమున - బలములనటుజూచిబహురోషముననను-బలునిగృష్ణునిజం
పిపాపపుతండ్రి -. నుగ్రసేనునిజంపియోడకమీరు - నిగ్రహింపుడురాము
నెనరింతలేక - వసుదేవదేవకీవారలద్రుంచి - కసిదీరనిచటికిగ్రక్కు-నరండు-
మనమలరగబహుమానంబులిత్తు-ననిపనిచినజూచిహలధరుడంత- కదిసినబల
ముపైగాలునిపగిది-గదద్రిప్పివైచినగడుభీతితోడ - బరువులెత్తిరితమపంతం
బుసడలి-హరిమోదనుంచుచునన్నతోననియె - నిచ్చటవీరిపై నెదుర నేమిటికి-
ముచ్చటలెల్లనుముందరగలవు - రమ్మనియటుచనరాజసంబునను-డిప్పరితన
మునధీరుడైయున్న-యలకంసునటుజూచియాగ్రహంబునను- జలమునఖడ్గం
బుఝుళిపించికొనుచు- గోపాలుడప్పుడుకోపంబుతోడ - నాపాపకముఁనిన
వలీలద్రుంచి-కరిసీద్పుహరిక్రియగ్రక్కు-ననతని - హరియీడ్చివయిచెనునతి
వేగమునను - సురలంతమింటనుసొంపుదీపింప - విరులునుజల్లిరి వేడుకతోడ-
బాడిరికిన్నెరభావములుచెలగి - యాడిరిరంభాదియప్సరలెల్ల- వీణెమీటుచు
బొంగివిష్ణుకీర్తనలు- నాణెంబుగాబాడినారదుడుబ్బె - రామకృష్ణులుమది
రంజిల్లనపుడు· తామసించకపోయితల్లిదండ్రులకు-దండప్రణామముల్ దగ
నాచరించి- నింపుమవేడుకతోడనెనరులుప్పొ - మధురవాక్యంబులమమతలు

ప్పొంగ-సదయులై వారికిసంతోషమొదవ-నపుడుగ్రసేనునికారాజ్యపదవి-
దిపుణులై పాలించి నెగడుమునీవు-అనుచు నొప్పించిననఖిలబంధువులు - మన
మనుప్పొంగమాధవుడొప్పె- నీరీతిమధురనునింపొదవంగ-గారవంబుననుం
డికమలనాభుండు-తల్లితండ్రులబంధుతతిమిత్రజనుల-జల్లనికరుణతోసరగర
ప్పించి-మధురలోనుండనుమనకేలయనుచు- బదిలుడైయంబునిధిప్రాంత్యంబు
జేరి-విశ్వకర్మునుబిల్చి వేడుకతోడ - విశ్వంబులోగడువిస్మయంబుగను-వా
రిధినడుమనువైభవంబెసగ- ధారుణీశులుమెచ్చదగుపురంబొకటి - గావిం
పుమనుచునుగట్టడిసేయ- నావిధంబంతయునతడాలకించి - సకలశృంగార
ముల్ సకలవైఖరులు - సకలచాతుర్యముల్ సకలచిత్రములు-కోటలుకొమ్మ
లుకొత్తడంబులును[illegible]టమాతేరులువాజులుకరులు - సాటిసేయగరానిస
ద్ఘటకోట్లు- వాడలుమేడలువరవిలాసములు- చూడగబొడవయినసుందరం
బయిన-గోపురప్రాకారకుడ్యముల్ దనరి - నాపురంబొప్పెనునతివేడ్కలమ
రి- మణిమయదీప్తులమహిమజెన్నలరి- గణుతింపరానట్టికడుచోద్యముగను-
నయనోత్సవంబుగానగరునిర్మించి - భయదోగ్రమయినట్టిపక్షీంద్రుధ్వ
జుము-నెత్తించిదిక్కులనేపుదీపింప - మొత్తంబుగాసురల్ మ్రొక్కచుండగ
ను నంతనాశిల్పియుహరిగాంచిమ్రొక్కె - వింతయాపురిఝూడవిచ్చేయుమని
న-నన్నయుదానునునఖిలబాంధవులు - కన్నులపండువై గనుపింపగాను-తరు
చుగాభేరులుతమ్మెటధ్వనులు వరుసతోసంగీతవాద్యముల్ మ్రోయ- నగరు
ప్రవేశించినలిననాభుండు-అగణితంబుగమింటనమరులుగూడి - పువ్వులవా
నలుభోరునగురియ-మవ్వంపు వేడ్కతోమాధవుడొప్పె. ... ... *

వ॥ అంతద్వారకానగరంబుసకలశృంగారవైఖరులంజెలంగబలరా
మకృష్ణులుప్పొంగుచు సకలయాదవసేనాజనంబులు గొలువసకలసంపత్క
రంబొప్పద్వారకానగరంబుననున్నంత॥

క॥ఆవనజగర్భుపంపున।రైవతుడనురాజుదెచ్చిరామునకిచ్చెన్ । రేవతి
యనియెడుకన్యను।భూవరమునువింటిగాదెబుద్ధిందెలియన్॥ ... ... *

జంపె.

ఆసతిసిహాలధరుండతివేడ్కబెండ్లాడె- భాసురంబుగసురలుప్రస్తుతిం
పగను।ఆసమయమునని చ్చెనరణంబురైవతుడు । దాసదాసీజనులధనకనకచ
యము । బలుడురేవతియొప్పెబలవైరిశచిరీతి। సలలితంబుగభోగసకలసం

పదల ॥ పురముభాసిలెసకలభువనత్ల్లజమనగ । సురగులునువసియించుపు రినిగిడ్డరచి॥

వ॥ ఇట్లొప్పుచున్న ద్వారకానగరంబుననిత్యోత్సవంబుచెలంగగోపాలచూడామణిలీలామానుషవిగ్రహుండయి భూజనంబులానందంబునొందనవరసంబులు నెరపుచున్నకృష్ణదేవునిరూపరేఖావిలాసంబులుచెలికత్తె లవలనవినిరుక్మిణీదేవిహరివరునిగాగోరి తనమనోరథంబుతెలుపుమనిబ్రాహ్మణునిద్వారకానగరంబున కనిచిననతండువచ్చిహరితోవిన్నవించిననభిమతంబు తెలిసిచనిసకలరాజలోకంబును జయించిరుక్మిణిందెచ్చివివాహంబయ్యెనంతక్రమక్రమంబునసత్యయు జాంబవతిమిత్రవిందసుదంతలక్షణబద్రకాళిందియనియెడు రాజకన్యలబెండ్లిమాడియత్యంతవయిభవంబుననెనమండ్రుపట్టపుదేవులనేలుచున్నంత॥

త్రిపుట.

ధరణీమిత్రుడునరకదైత్యుడుతానుమదమునరాజకన్యల - జెరలుదెచ్చియునునిచెమిక్కిలిచపలుడగుచు ॥ అట్టిదయిత్యునిదునిమివేగమెయచటనుండినరాజకన్యల - బట్టభద్రుడుశౌరిదెచ్చెనుబంగబురికి ॥ తెచ్చివేగమెపెండ్లియాడెనుదేవగణములుసన్నుతింపగ - నొచ్చమించకలేనితరుణులనుల్లసమున॥

క॥పదునారువేలకన్యల ॥ ముదమునబెండ్లాడెశౌరిమోహంబెమో। సదయుండైయామగువల। యదనులుగురుతెరిగికూడహరికేతెలుసుగా॥

క॥అందఱికినన్నిరూపులు। సుందరధరుడపుడుదాల్చిమదనునికేళిం। జందనగంధులగదిసెను। సందేహములేకచెలులుసంభ్రమమొప్పన్॥

వ॥ ఇటువలెనెనమండ్రుపట్టపుదేవులయందుపదనారువేలగోపస్త్రీలమనంబులవారివారికిదమకంబులప్పొంగ దమప్రియుండెన్నండెడబాయకనాయందేమోహంబునవర్తింపుచున్నాడనుచు నందరిహృదయంబులురంజిల్ల జేయుచున్నహరివిలాసంబుచూచుటకునారదుండుద్వారకకువచ్చెనటమెటువలెను॥

త్రిభంగులు,

పట్టెనామమునుదుటబెట్టి-కావి- పంచెచుంగులుజారగట్టి॥ పట్టుధోవతితత

నుజుట్టి-మంచి-బలువుదండము చేతబట్టి ॥ దిట్టమమరగవీణె మెరయ మేటి-
దివ్యమంత్రముమదిని వెలయ॥అట్టెకృష్ణునిమహిమనోరయ- దాను-నచటిమ
ర్మము లెల్ల దెలియ॥ పోరుబోనముతిండిదారి - తానుబొందికనురగజెలువు
మీటి॥వారిజాక్షునివద్దజేరి-యతనివాలాయముగనెపుడుగోరి॥సారెసారె
నపినుతులమర-జేసిచాలవేడుకయింపుదనర॥

వ॥ ఇటులవిష్ణుభక్తుండైననారదుండు వినుతించినహరిరుక్మిణీసమే
తుండైయతనికి నర్ఘ్యపాద్యాదులిచ్చి కనకరత్నప్రభల వెలుంగుగద్దియపై
గూర్చుండ నియమించికుశలంబడిగిన నాదివ్యమానియేమనుచున్నాడు.

జంపె,

. నీకటాక్షముగలుగనీరజాసనసురులు - పాకారికెప్పుడునుబరణాము
మయ్య ॥ సకలభూతము లెల్ల సంతోషమునబొంగి- యకలంకచిత్తమునహ
ర్షించెనయ్య ॥ ఇపుడుద్వారకనుండియీసతులవరియించు-నిపుణతకులో
కములనిన్నెంతురయ్య॥ఈరుక్మిణీదేవినిందిరనుమదినుంచు-వారిజాక్షుడవీ
వుపైకుంఠపతికి ॥ అనుచుబొగడినగృష్ణుడాదివ్యమానికిని - జనువుతోడను
నపుడుసన్మానమొసగెను॥

వ॥ అంతనారదుండు సత్యభామమందిరంబునకునరిగిననచ్చట
చెలులతోబాచికలాడుచున్నహరినిస్తోత్రము జేసిజాంబవతీసదనంబునకునరిగి
నచ్చట నాపూగువతో ముచ్చటలాడుచున్న కేశవునిదర్శించి కాళిందీగృహం
బునకుబోయిననందాసుందరాంగికిదిలకంబుదిద్దుచున్నవినుతించిమరియు నిం
టింటికేగిననచ్చటచ్చటనున్నవిలాసంబులెట్టివనిన.

సీ ॥ ఒకయింటనింతితోనుల్లాసమాడును నొకయింటసతిజేరియూర
డించు । నొకయింటగొమ్మకునొప్పగాజడలల్లు నొకయింటవనితతో నూగు
చుండు । నొకయింటదెరవకు నొనరగంధముబూయు నొకయింట నెలతకు
నొసగుచొడవు । నొకయింటసాధ్వికి నొసగునుజీరెలు మఱియొకచేడెకు
మడుపులిచ్చు । మఱియొకతెగూడి రతికేళిమరులకొల్పు । మడుపులందిచ్చునొక తెకుమణివిచెప్పు। విరులనందిచ్చునొక తెపువేడ్క-జూపు । నింటవింట
నుసిరిజంటగూడి॥ ... ... ... ... ... ... ... ... ... *

## ద్విపద.

అప్పుడానారదుడాశ్చర్యమునను - దప్పకనింటింట దరుణులచెంత-
రాయకృష్ణుండు పదిలుడయియున్న సోయగంబులుచూచి సొంపుదీపింప- న
చ్చటశౌరినిహర్షంబుతోడ - పిచ్చలవిడిదాను వినుతులుచేసి - దేవనీమహి
మంబు తెలియంగవశమె- భావజ్ఞులయినట్టిభక్తులయందు - దగిలివర్తింతువు
సత్వమార్గమున - జగములకెల్లనుసాక్షివినీవె - యనుచుప్రార్థనచేసియరి
గెనారదుడు- మనమునను ప్పొంగిమాధవుడంత। జెలులుతన్నెప్పుడుచేకొల్వ
గను - జలువంబుతోబురస్త్రీలువేడుకను - గ్రొత్తపెంపెక్కసుమారుగోపాల
మూర్తి-జిత్తంబురంజిల్లసేవింతుమనుచు- గానుకలునుగొంచుకడుసంభ్ర
మమున- మానినీమణులెల్లమాధవుగాంచి- మంగళారతులెత్తిమక్కువతోడ
బొంగుచుపాడిరాపూబోణులపుడు. ... ... ... ... ... ... *

## మంగళము.

మంగళముగోపికామదనావతారునకు - మంగళమువైకుంఠమందిరు
నకు - మంగళముకోట్యర్క-మహనీయతేజునకు - మంగళముమమునేలుమా
ధవునకు ॥ జయమంగళం నిత్య శుభమంగళం ॥ బాలుడైపూతకిని బరిమా
ర్చి వెగటుచే - గాలదన్నెనుబండి గర్వమడగ - మేలుగాసుడిగాలి మెడ
నులిమిబడవైచి - యీలీలజరియించు నీశునకును ॥ జయ ॥ గొల్లవాడలజొ
చ్చిగొల్లుచేయుచువెన్న - గొల్లలాడగముద్దుగుమ్మలెల్ల - మొల్లమిగగుమి
గూడి మ్రొక్కి-వేడినవారి - మెల్లనేభ్రమియించు మేటికిపుడు ॥ జయ ॥
రేపల్లెపురిలోన రేపుమాపువెలసి - గోపకాంతలనేత్రకుముదములకు-
నేపునను శశిరీతి నింపుచూపెడుముద్దు- గోపాలమూర్తికిని శ్రీపతికిని॥ జయ॥
జడివానలరుమిగుల జడిసియాదవులెల్ల గడువేగ మొరలిడగ గరుణజూచి -
గొడుగుగానెకవ్రేలగొండతా ధరియించి - వడిగవారలబ్రోచు వనమా
లికి॥ జయ ॥ చాణూరముష్టికులజంపియునుమాకంసు - ప్రాణముల్ గొన్న
గోపాలునకును - రాణించుద్వారకను రంజిల్లుచున్నట్టి - జాణునకు వేదాం
తసారమణికి ॥ జయ॥ ఎనమండ్రు దేవులను నేలుచునుతివేడ్క - వినుతిగా
బదునాఱువేలసతుల- జనువిచ్చివారలకు సంతోషమొనరించు - వనజాక్షు
నకుభక్తవరదునకును ॥ జయమంగళం - నిత్యశుభమంగళం. ... ... *

వ॥ ఇటువలెశోభనాంగుడైనహరికిమంగళంబులుపాడి మానవతుల

కు జీర్ణజీనాంబరాభరణంబులిప్పించినవారలు సంతోషంబునదమగృహంబు లకుజనిరంతగోపాలుడు శ్రీలోలుండై సకలభోగభాగ్యంబు లనుభవింపుచు సుఖంబుండెనప్పుడు॥

జంపె.

పుత్రులునుమిత్రులును బొందుగా వెలసినను - మిత్రులునుగూడుకొని మెరసెమాధవుడు ॥ నిత్యకల్యాణములు నిండు వేడుకనమర - సత్యాసంధుడుశౌరిజనులబాలించెరా॥ ఎల్లలోకము లెల్ల నెప్పుడునుగృష్ణుండు - మొల్లమిగగరుణించు మోదమిగురో త్తరా. ... ... ... ... ... ... *

వ॥ఇట్లుకప●నాటకసూత్రధారియైనగోపాలవిలాసంబుపరిక్షిత్తునకు శుకయోగీంద్రుండు చెప్పినవిని పరమానందంబు నొందెనప్పుడు పారాశర్య పుత్రుండేమనుచున్నాడు.

ద్విపద.

ఈకృష్ణుచరితంబునింపుతోడుతను - వాక్రుచ్చియెవ్వరువర్ణనల్ సేయ - యెవ్వారు చదివిన నెవ్వారువిన్న - నెవ్వారు వ్రాసిన నిందిరాధవుడు - ఆయురారోగ్యములయిశ్వర్యపదవి - పాయనికరుణచెబాగుగానొసగు - నీవిష్ణుమాహాత్మ్యమిరవుగా నెపుడు - భావంబులోనెంచ బాపముల్ దొలగు - నిపుణ్యకథ లెవరెంచినమెచ్చి - గోపాలకృష్ణుండుకోరికెల్ దీర్చు - నిపుణులయియాకృతి నెగడించువారు - నపరిమితోత్సాహమందుండనిజము - హరికథామృతసారమబ్బినయట్టి - నరులెల్లసురలనినారదుండనియె - గావునశ్రీహరికథలుపఠించు - భావజ్ఞులకు మోక్షపదవులుగలవు - ననియిట్లుశుకయోగి యానతిచ్చినను - వినిపరిక్షిత్తుండు వేడ్కలుప్పొంగ నేనుధన్యుడనైతి నిపుణనీవలన - నేనుసుకృతినై తినితరసౌఖ్యములు - అబ్బెనటంచును నామానితోడ - నుబ్బుచునిట్లనె నోంమహాఘనుడు - సాయుజ్యపదవులు సాంబ్రాజ్యగరిమ - మాయతంబుగగల్గె హరికథవలన- వినతుకైపది వేలవిధములబొగడి - తనమదిరంజిల్ల దగనుండెనంత అనియిట్లు సకలాత్ముడగురాము పేర - వనజా పకులుడైన వైభవు పేర - నాగమ వేద్యుని యవనిజాప్రియుని - బాగుగా నామదిబ్ర స్తుతి జేసి - పరమభాగవతంబు పదపద్యరచన - విరచితంబగులోక విఖ్యాతిగాను - నారాము

విభునకు నర్పణచేసి - సారంబుగన్నట్టి సరసుండ నేను - మావంశచరితం
బు మహిలోన వెలయ - సావధానంబుగా సన్నుతించెదను - పాకనా
టిరెడ్ల భాగ్యమెట్లనిన - నాకలిగొన్నట్టి యర్థుల నెపుడు - పోషింపగలిన
పుణ్యులటంచు - భూమింపు చుందురు భువనంబులందు - నట్టిమహాపుణ్యు
లవనిలో వెలసి - నెట్టనగీర్తుల నెగడినవారు - గోనబుద్ధారెడ్డికులపవిత్రుం
డు - దానరాధేయుండు ధర్మవిహారి - కామితార్థంబులుకవులకు నొసగి
రామాయణములోనరశికుడమునిలిచె - గురుతుగానముల గుండ్రంబులం
దు-సరసుండుబొమ్మన్నసత్కవులెన్న - శ్రీశయిలమునసదాశివునకు బ్రీతి
భాసిల్లుగోపురప్రాకారతతులు - మంటపంబులు వెలయమల్లికార్జునకుజంట
భ్రమరాంబకుసదనంబులమర - గనకమయంబుగాగట్టించెగుళ్లజనులుప్ర
స్తుతిచేయజగతిలోపలను - దంగేళ్లయాచెన్నతగనర్థివరుల - ముంగిటచిర
త్నమయి మోదంబుతోడ - ధనకనకవస్తువుల్ తనియంగనిచ్చి - వినియంబు
తో డనువిఖ్యాతిగాంచె - బాలబ్రహ్మరెడ్డిప్రభుడుద్భవిల్లె - మేలుగా
తనకని మెరసె జిన్నన్న - పరికింపనతనికి బుట్టెపెద్దన్న - యన్నపిన్నగురెడ్డి
యతనికిబుట్టె - సన్నుతుల్ గాంచెను సకలదిక్కులను - నతనికి జని
యించెనర్కతేజుండు - మతిమంతుడగుపెద్ద మండలేంద్రుండు కాశికి
దాబోయి కావివిదెచ్చి - భాసిలురామేశు పదములు గొలిచి - తగసుజ్ఞా
నంబనుతరుణిబెండ్లాడి - సుగుణవంతులమేటి సుతులనుగాంచె - విశ్వం
బులోగడు విఖ్యాతిగాను - విశ్వనాథుండన వెలసెనగ్రజుడు - వరుసగా
శపరెడ్డివార్ధిగంభీరు - డరయచిన్నమరెడ్డి యంగడిరెడ్డి - నలుగురుసతు
లునునలుదిశలందు - జెలువంబుప్రబలిరి జనులునుతింప - వారిలోనెం
చగవంశవర్ధనుడు - పేరుపిన్నమరెడ్డి పెంపురమింప - సుముఖుడై యాచ
కసురభూజమనగ - నమితమాజనులలోనతిమహోఘునుని - నతివగామాక్షు
మ్మయనఘ చారిత్ర - మతినిజ పతి నెప్డు మరువక దలచు - నిట్టిదంపతులకు
సింపులు మీాఱ - బుట్టిన వాడను భూజను ల్బొగడగ - బ్రేమతో గణపతి పే

రుసు బెంపు - ధీమసంబున వెలయు ధీరుండు నేను- భాగవతార్థంబుపపద్య
వచన - బాగుగా రచియించి పండితుల్ మెచ్చ - నారామవిభునకు నర్పణ
చేశి - గారవంబొప్పగా గాంచితి మేలు - నీవిలాసముభువి నెసఁగవర్ధిల్లు-
గోపికల్ మెచ్చగ గోపాలుకృపను - సోముండుసూర్యుండు సురలుతార
లును - భూమియు మొదలయినభూతంబులందు - ఎందాకనుండు నోయీక
థా సరణి - యందాక యీకథయఖిలదిక్కులను - సలలితంబుగ శౌరి సం
కీర్తనములు- చెలువొందనొప్పుచు శ్రీరామకృపను. ... ... ...*



గోపాలవిలాసము - యక్షగానము.



సంపూర్ణము.

